ఆంధ్రప్రదేశ్ మహిళా సంఘం

# మహిళా ఉద్యమం — నిర్మాణ సమస్యలు

## 1 మహిళా సంఘాల స్వభావం

మన దేశ స్త్రీలనుగూర్చి ఆలోచించే ముందు వారిస్థితి గతినిగూర్చి ఆలోచించాలి. మన దేశం జమీందారీ యుగము నుండి పూర్తిగా బయటపడలేదు. అందువల్ల ఆయుగపునాటి మూఢనమ్మకాలు, ఆచారాలు, అవిద్య, అజ్ఞానాలలో స్త్రీలు మునిగి యున్నారు. ఆస్తిహక్కు మొదలైన ఆర్థిక హక్కులు, వోటింగు మొదలైన రాజకీయ హక్కులులేవు. కనుకమహిళా సంఘాలు జమీందారీ యుగపునాటి కట్టుబాట్లను పోగొట్టి పురుషులతోపాటు స్త్రీలకు సమాన ప్రతిపత్తి సంపాదించడానికి పాటుపడతాయి.

1. ఇవి సాంఘికదురాచారాలకు, స్త్రీలఆర్థిక, రాజకీయ ఇతర ఇబ్బందులను తొలగించడానికి స్త్రీల సర్వతోముఖాభివృద్ధికి పాటుపడే సంఘాలు.

### వర్గ సంఘాలు కావు

2. రైతుకూలీసంఘాలవలె ఇవివర్గసంఘాలుకావు కనీస కార్యక్రమాన్ని ఆశయాలను అంగీకరించే ప్రతి స్త్రీ ఏవర్గానికి చెందినావారే సభ్యురాలుగా ఉండవచ్చును. యువజన విద్యార్థి సంఘాలుకూడ యీరకానికి చెందినవే. కనుకనే యీవర్గాలకు చెందిన జండాలమీద కత్తి, సుత్తిలాంటి వర్గచిహ్నాలు ఉండవు. స్వాతంత్ర్యం, శాంతి, అభ్యుదయం అనే మాటలుంటాయి.

## రాజకీయ పార్టీలుకావు

3. ఈ సంఘాలలోవుండేవారు ఒకే సిద్ధాంతాన్ని, రాజకీయ దృక్పథాన్ని కలిగి ఉండాలన్న నియమంలేదు. వేరు వేరు రాజకీయ దృక్పథాలను, సిద్ధాంతాలను కలిగిఉన్నా సరే, కనీస కార్యక్రమాన్నంగీక రించేవారంతా సభ్యులుగా యుండవచ్చు. కమ్యూనిస్టు పార్టీలో అట్లుగాక అందరూ మార్క్సు, లెనిను సిద్ధాంతాల నంగీ రించి ఆదృక్పథాన్ని కలిగి యుండాలి.

అందువల్ల కమ్యూనిస్టుపార్టీలో శిక్షణ చాలాకఠినంగా ఉంటుంది. (1) ప్రతి సభ్యుడు మార్క్సు లెనిను సిద్ధాంతాల నంగీకరించడం. (2) పార్టీ సభ్యత్వ రుసుమును చెల్లించడం. (3) పార్టీమీటింగులకు హాజరు కావడం. (4) పార్టీ ఇచ్చిన పనిని ఇష్టములేకపోయినా చేయడం (5) పార్టీసాహిత్యాన్ని గట్టిగా చదవడం విధిగా ఆచరించాలి. ప్రజాసంఘాలలో సామాన్య సభ్యులు సంఘ ఆశయాల నంగీకరించి సభ్యత్వరుసుము చెల్లించితేచాలు. తీర్మానాలను వ్యతిరేకించినంత మాత్రాన సభ్యత్వంపోదు. సంఘంలోని ప్రముఖులు మాత్రం తీర్మానాలను వ్యతిరేకించరాదు. అట్టివారిపై శిక్షణచర్య తీసుకొనవచ్చును. కమ్యూనిష్టు పార్టీయొక్క శిక్షణను ఇక్కడకూడ అమలు జరిపితే యీసంఘాలలో కమ్యూనిస్టు స్త్రీలు తప్ప మరెవరూ యుండరు.

4 మన దేశం జమీందారీ యుగమునుండి పూర్తిగా బయటపడక పోవుటవలన మహిళా సంఘాలలో అధిక సంఖ్యాకులు, జమీందారీ యుగపు కట్టుబాట్లతో ఎక్కువగా బాధ

పడే యువతులు, పట్టణ మధ్యతరగతి స్త్రీలు మహిళాసంఘా లలో చేరుతారు. అయినప్పటికి జమీందారీ యుగపు కట్టుబాట్ల తో ఎక్కువగా బాధపడిన పెట్టుబడిదారి, కార్మిక స్త్రీలుకూడ కొందరుంటారు. జమీందార్ల స్త్రీలుకూడ కొందరాకర్షింప బడవచ్చు.

5. జమీందారీ విధానము పూర్తిగా నిర్మూలింప బడిన ఇంగ్లండు, అమెరికాలాంటి దేశాలలో మహిళా సంఘాలు ఎక్కువగా ఆహారసమస్యలు, యిళ్ళ అద్దెసమస్యలు తీసుకొని పనిచేస్తాయి.

---

# 2. మహిళా ఉద్యమం

సంస్కరణ, విప్లవమార్గాలు - స్త్రీలకు రాజకీయాలకు సంబంధం - రాజకీయాల్లోకూడా సరియైన ప్రజారాజకీయాలు కావాలి.

1. ప్రజాసంఘాలద్వారా స్వాతంత్ర ఉద్యమాన్ని బలం చేసేమార్గం కాంగ్రెసులో లేదు. ఇది కమ్యూనిష్టులమార్గం.

2. కాని మహిళాసంఘాల నిర్మాణానికి ఒకపార్టీయే కాదు పనిచేస్తోంది. బూర్జువా మహిళాసంఘాలుకూడా బయలుదేరుతున్నాయి. కాని యీ సంఘాలకు సామాన్య స్త్రీలతో సంబంధం లేదు. స్త్రీలకైనదిన కష్టాలమీద సంఘా లను నిర్మించే పద్ధతిని అనుసరించలేవు. ఉదాహరణలు.

వీరిది బూర్జువా సంస్కరణమార్గం. సంస్కరణమార్గంలో యింకా కొన్నిరకాలున్నాయి. రామమోహనరాయి, వీరేశలింగం, చలంసిద్ధాంతాల ప్రయోజనం ఎంతవరకు? ఈ సంస్కరణలన్ని నిజమైన ఆర్థికరాజకీయ స్వాతంత్ర్యాన్ని, విజ్ఞానాన్ని, సమానత్వాన్ని సంపాదించలేవు. కారణం సంస్కరణ వాదులందరికి రాజకీయాలుగిట్టవు. ప్రభుత్వవిధానం ఎప్పటిమాదిరిగానే ఉండి, సాధ్యమయినంత వరకు కొన్నిసాంఘిక దురాచారాల్ని తొలగించాలని కొన్ని ఆర్థికహక్కులనుసంపాదించాలనివుద్దేశ్యం.

3. పెట్టుబడివిధానం ఉన్న అన్నిదేశాలలో సంస్కరణ పద్ధతులమీద ఆర్గనైజుచేయబడ్డ మహిళాఉద్యమాలున్నాయి. ప్రయోజనం? సూన్యం.

నిజమయిన ప్రజాప్రభుత్వంఉన్న సోవియట్ యూనియనులో మహిళాఉద్యమం విప్లవఫలితంగా ఏర్పడింది. ఆర్థిక స్వాతంత్రం, విజ్ఞానం. నిజమైనసమానత్వం స్థాపింపబడ్డవి. ఉదాహరణలు. స్త్రీలవిమోచనమార్గం సోషలిజంతప్ప యింకొకటి కనపించదు.

సోవియట్, చైనా దేశాలలో యుద్ధంలో స్త్రీలకృషి

4. మహిళాసంఘ ఆర్గనైజర్లందరికీ విప్లవదృక్పథం ముఖ్యావసరం. నిజమయిన ప్రజాప్రభుత్వాలని స్థాపించడానికి రాజకీయాలతో సంబంధమవసరం.

5 కాని రాజకీయాలలో అనేక పంథాలున్నాయి. ప్రస్తుత రాజకీయాల్లోఉండే మూడుపంథాలు 1—కాంగ్రెసునాయకత్వపుమార్గము (2) బోసుమార్గం (3) కమ్యూనిష్టులమార్గం.

నిజానికి మొదటిరెండు ఒకేఫలితానికి దారితీస్తయి. బ్రిటిషుప్రభుత్వం స్వాతంత్ర్యాన్ని యివ్వాలంటుంది కాంగ్రెసు నాయకత్వం. జపాను స్వాతంత్ర్యాన్నిస్తుందంటాడుబోసు. ఫలితంఫాసిజం. ఇతరులమీద ఆధారపడక మనప్రజలమీదనే ఆధారపడాలంటుంది కమ్యూనిష్టుపార్టీ. ప్రజాసామాన్యపు రాజకీయాలకు పై వర్గాల రాజకీయాలకు ఎప్పుడూఉండే వైరుధ్యమే పరిస్థితులనుబట్టి అనేకరూపాలను తీసుకుంటుంది.

6. పై వర్గాలలోవారికి ప్రజలు లెక్కలోకి రారు. వారి రాజకీయాలన్ని వారివర్గ లాభాలకు సహాయపడే రాజకీయాలు. ప్రజల అభివృద్ధికి తోడ్పడేవి కావు. మనవి ప్రజారాజకీయాలు అందువల్ల ప్రజల అభివృద్ధికి, ప్రజలలోసగభాగమైన స్త్రీలఅభివృద్ధికి దారితీసేమార్గం మనది.

---

# 3. కార్యక్రమాన్ని నడపడానికి నిర్మాణంఆవశ్యకత

ఒక పనిని నిర్ణీతపద్ధతిలో అందరమూకలసి నిర్వహించడమే నిర్మాణయుక్తంగా పనిచేయుట. ఒకసంఘములో వివిధ వ్యక్తులు పనిని విభజనచేసుకొని ప్లానుప్రకారం పనిచెయ్యాలి. దీన్నే ఆర్గనైజేషన్ అంటారు. పనివిభజనలేకుండా ప్లానులేకుండా ఏదోఒకపని చేయమని కాగితంమీద అప్పీలు యిచ్చినంత మాత్రాన జరుగదు. ఆర్గనైజేషన్ద్వారా ఒకపనిని కొనసాగించుటవల్ల అందరినీ ఒకసారి కదల్పగల్గుతాము. కనుక కార్య

క్రమాన్ని ప్రజలదగ్గరకు తీసుకువెళ్ళడానికి ఆర్గనై జేషన్ సాధన మన్నమాట.

సంఘమును నిర్మించుట, నడుపుట

సంఘంయొక్క ఆవశ్యకతను గ్రహించేటట్లుచేసి సభ్యులనుచేర్చి సంఘాన్ని ఏర్పరచాలి. సంఘమును ఏర్పరచిన తరువాత అప్పుడప్పుడు మొక్కుబడితీర్చడానికి సమావేశపర్చడం గాని, మధ్య వారిముఖమే చూడక సంవత్సరాంతం మరల సభ్యులను చేర్పించడానికి పోవశంగానిచేస్తే, తమసంఘమన్న అభిప్రాయంపోయి చందాలుపోగుచేసుకుని వెళ్ళడానికేవచ్చినట్లు సామాన్యస్త్రీలు అనుకుంటారు.

కనుక విరివిగా పేపరుసంఘాలుపెట్టి ప్రయోజనంలేదు. మనం ఎన్నిసంఘాలనైతే క్రమముగా సమావేశపరచి పని చేయించగలమో అన్నిటినే ఏర్పరచి వారిదైనందిన కష్టాలు పోగొట్టడానికి ప్రయత్నించి సామాన్యస్త్రీలలో గట్టిసంఘాభిమానాన్ని కలుగ జెయ్యాలి. ఆవిధంగా కొన్నిసంఘాలమీద దృష్టిని కేంద్రీకరించి పనిచేస్తే, అవిసంఘానికి కోటలవలె తయారవుతాయి.అక్కడనుంచి ఉత్సాహవంతులైన యువతులు ఇతరచోట్లగూడ పనిచెయ్యడానికి తయారవుతారు యీవిధంగా నిర్మాణయుక్తమైన మహిళాఉద్యమం ఏర్పడుతుంది.

ఆఫీసు

ఫైళ్ళు—క్రిందిసంఘములకు పంపేసర్క్యులర్ ఫైలు, సంఘాన్నుంచి వచ్చేసర్క్యులర్లకు ఉత్తరాలకు ఫైలు—క్రింది సంఘాలనుండి వచ్చేరిపోర్టులకు ఉత్తరాలకు ఒక్కొక్క సంఘానికి

ఒక్కొక్క ఫైలు — ఇతరఉత్తరాలకు ఒకజనరలు ఫైలు, ఇంకా అవుసరాన్నిబట్టి ఎక్కువఫైళ్ళు పెట్టుకోవచ్చును.

## మినిట్సు పుస్తకం.

దీనిలో కార్యనిర్వాహక సమావేశాల్లోను, సాధారణ సమావేశాల్లోను, హాజరయిన సభ్యులసంతకాలు, ఎజెండా, తీర్మానాలు వ్రాయబడును.

## జమాఖర్చు పుస్తకం.

దీనిలో జమలు ఒకకాలంలోను, ఖర్చులు ఒకకాలం లోను, వివరంగా వ్రాయాలి. ఓచర్లన్నీ ఒకఫైలులో ఉంచాలి.

## వచ్చినఉత్తరాలు, పంపినఉత్తరాలు నోటుచేసుకొనే పుస్తకం

దీనిలో వచ్చినతేదీ, లేక పంపినతేదీ, ఎవరికి వ్రాయ బడింది? దేనినిగూర్చి వ్రాయబడింది? వ్రాయడానికి వేరువేరు కాలములు ఉండాలి. ఉత్తరంవచ్చినవెంటనే లేక వ్రాసినవెంటనే ఇందులో వ్రాయాలి.

ఉత్తరప్రత్యుత్తరాలు జరపడానికి జిల్లాసంఘ ఆఫీసులో ఒకరుండడం అవసరం. క్రిందిసంఘాలతో ప్రత్యక్షసంబంధం పెట్టుకొని పనిచేయించడానికి ఆర్గనైజర్లు అవసరం. ఈ ఆర్గ నైజర్లు తమబాధ్యతక్రింద ఉన్నసంఘాలకువెళ్ళి వారికి సలహా లివ్వాలి. అవసరమైతే చేసికూడ చూపి చాలి.

## సర్క్యులర్లు

ఏవిషయాన్నిగూర్చి వ్రాస్తున్నదీ, దానిఉద్దేశ్యం మొదట క్లుప్తంగా వ్రాయాలి. ఏంచెయ్యాలో 1,2,3...వేసి పాయింట్లు వ్రాయాలి.

## రిపోర్టులు

క్రింది సంఘాలపనిని తనిఖీచేసి సలహాలిస్తూ నడపడానికి ఒకచోటి అనుభవాన్ని మరొకచోట ఉపయోగించుటకు క్రింద సంఘాలపై సంఘానికి రిపోర్టులు (నెల, పక్షం, వారం) పంపడం అవుసరం. అలాగే పై సంఘాలుగూడ క్రింద సంఘాల అనుభవాన్ని క్రోడీకరిస్తూ, క్రింది సంఘాలకు రిపోర్టులు వ్రాయడం కూడ అవసరం.

## రిపోర్టులలో ఉండవలసినవిషయాలు

ఏ తీర్మానాలు చేసిందీ - ఎలా అమలు జరిపిందీ వివరంగా వాస్తవిక విషయాలు— తప్పులు, ఒప్పులు— ముందు ఏం చేయనున్నది.

## ఉపన్యాసాలు చెప్పుట

స్థానిక పరిస్థితులను తెలుసుకోవాలి. తాను చెప్పబోయే విషయానికి స్థానికపరి స్థితుల కన్వయించి, అంటే స్థానికపరిస్థితుల నుండిఉదాహరణలను తీసుకొని నోట్సువ్రాసుకోవాలి. ఎక్కువ విషయాలను తీసుకుని వినేవారిని గందరగోళ పెట్టగూడదు. ఒకే విషయంమీద వివిధ దృక్పథాలనుండి చెప్పాలి — చెప్పే విషయాన్ని గూర్చిన పాయింట్లు ఒక క్రమపద్ధతిని ఒక

గొలుసువలె ఉండాలి. ఒకచోట మొదలుపెట్టి మరొకచోటకు గంతులు వేయరాదు. చెప్పే విషయం ప్రజల కర్థమవుతున్నదీ, లేనిదీ, వారిమీద ఎట్టి ప్రభావం కలుగుతున్నదీ ముఖాలను, బట్టి గ్రహించుతూ ఉండాలి. తదనుగుణ్యంగా భాషవిషయవిపులీకరణను మార్చాలి. వారలను సంతోషపెట్టడానికి విషయాన్నే మార్చివేయరాదు. ఉపన్యాసం చెబుతున్నపుడు ప్రజలు లేచిపోతుంటే పద్ధతులను మార్చి వారిని ఆకర్షించాలి. లేకపోతే. ఉపన్యాసాల్ని ముగించాలి.

## బహిరంగ సభలు.

కరపత్రంలో తేది, టైము, సభ జరుపుటలో నుద్దేశ్యం, ఉపన్యాసకులపేర్లు వ్రాయాలి. చిన్న చిన్న వీధిసభలు పెట్టి మీటింగు ఉద్దేశ్యాన్ని, చెప్పే విషయాలనుగూర్చి క్లుప్తంగా చెప్పాలి— వివిధపేటలనుండి ప్రజలను ఉత్సాహపరచి తీసుకు రావడానికి వ్యక్తులను నియమించాలి-ఉపన్యాసకులను ముందు వారి అనుమతి తీసుకొని నిర్ణయించాలి. వారికి స్థానికపరిస్థితులనుగూర్చి చెప్పి మాట్లాడేవిషయాలనుగూర్చి సలహా లియ్యాలి మీటింగు జరిగేచోట లైట్లువగైరా సామాన్లు ముందేసంపాదించి ఉంచుకోవాలి. టైంకు మీటింగు ప్రారంభించాలి.

## ఊరేగింపులు

జండాలు, అట్టలు మొదలైన వస్తువులను ముందేసేకరించుకుని ఉంచాలి—నినాదాలు యిచ్చేవారు, పాటలు పాడేవారు. పాడేపాటలు, నినాదాలు ముందుగా నిర్ణయించబడాలి. నిర్ణయింప బడినవారుతప్ప యితరులు నినాదాలు అరవరాదు.

వాలంటీర్లు, రెండో లేక మూడో వరసలుగా ముందునిల బడాలి. కొంతమంది బయటఉండి ప్రజలను లైనులోనిలబెట్టడం, మీటింగునుగూర్చి ప్రజలకు చెప్పడం చేస్తూఉండాలి—ఊరే గింపుకు వెళ్ళవలసినవార్ని ముందుగా నిర్ణయించాలి—కూడలి స్థానాలలో పాటనుఆపి నినాదాలు ఇవ్వాలి—ఊరేగింపును నడుపుటకు ఒక బాధ్యుని నియమించాలి.

## మహాసభలు

ఆ సంవత్సరం జరిగిన కార్యకలాపాన్ని వివిధప్రాంత ములనుండి వచ్చిన ప్రతినిధులు చర్చించి ముందు సంవత్సర కార్యక్రమం వేసుకోవడం ప్రజల్లో ఊరేగింపులు బహిరంగ సభలు జరిపినూతనోత్సాహాన్నికల్గించడం మహాసభల ఉద్దేశ్యం మహాసభలో రెండుభాగాలుంటాయి. 1. ప్రతినిధుల సమా వేశం. 2. బహిరంగసభ. ప్రతినిధుల సమావేశం ముందుగా జరగాలి. లేకపోతే బహిరంగసభా కార్యక్రమంలో కలసిపోయి సభయొక్క అసలు ఉద్దేశ్యమే భగ్నమవుతుంది. ప్రతినిధుల సమావేశానికి ప్రేక్షకులను రానీయరాదు.

బహిరంగసభకు అధ్యక్షత, సంఘాధ్యక్షురాలే వహిం చితే సామాన్యస్త్రీలకు పరిచయమవుతుంది. బయటివారు ఉప న్యాసకులుగా ఉండవచ్చునుగాని అధ్యక్షులుగా ఉండరాదు.

ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసంలో ఏర్పాట్లను గూర్చి అధ్యక్షులను ఎరుకపరచుటనుగూర్చి మాత్రమే ఉండాలి.

అధ్యక్షోపన్యాసంలో రాజకీయ పరిస్థితి, ప్రజలకున్న అనుమానాలు, సంఘకార్యక్రమాన్నిగూర్చిసూచనలుఉండాలి.

ప్రారంభోపన్యాసం ప్రత్యేకంగా అవుసరంలేదు. పతా కాగోహకుడు ప్రపంచరాజకీయాలలో మునిగిపోకుండా పతాకం లోని చిహ్నాల ప్రాముఖ్యతనుగూర్చి చెప్పాలి. అందరూ రాజ కీయాల్లోకి పోతే చెప్పిందే చెప్పటం. ప్రజలకు విసుగెత్తి లేచి పోవడం జరుగుతుంది.

ప్రచారం:— మహాసభ ముందు కరపత్రాలు, వీధిమీా టింగులు, ప్రభాతభేరీలు, పోస్టర్లద్వారా ప్రచారం చెయ్యాలి.

మహాసభ ఏర్పాట్లు:— ఒక కమిటీ నియమించ బడాలి. అందులో 1. ప్రచారం 2. ధనసేకరణ 3. భోజనం వసతి మొదలైన ఏర్పాట్లుకు వేరు వేరు సభ్యులుండాలి.

సాంవత్సరికరిపోర్టు:—1. గతమహాసభ చేసిన తీర్మానాలు ఎంతవరకు అమలు జరిపిందీ, అందుకు కార్యవర్గం ఏమి కృషి చేసిందీ, ఎంతవరకు ఫలప్రదమయిందీ ఎంతవరకు కాలేదో కారణాలతో సహా వివరంగా ఉండాలి. 2. ముందుపనికి సూచ నలు 3. సంఘసభ్యత్వం ఎంతపెరిగిందీ? అధీన సంఘాలపని. 4: జమాఖర్చులు.

మహాసభరిపోర్టు: —

మామూలు రిపోర్టులలో నుండే హంశాలేగాక ధనసేక రణ, ఏర్పాట్లు ప్రజలమీాద కలిగిన ఫలితం మొదలగువానిని గూర్చి కూడ ఉండాలి.

# 4 ఆశయాలు-కనీసకార్యక్రమము

## ఆశయాలు

1 స్త్రీలకు పురుషులతోపాటు సర్వవిషయములందు సమానహక్కులు సంపాదించుటకై కృషిసల్పుట.

2. స్త్రీలలో విజ్ఞానాభివృద్ధిని కలుగజేసి, మూఢనమ్మకాలను, దురాచారాలను పోగొట్టి, స్త్రీల సర్వతోముఖాభివృద్ధికి పాటుబడుట.

3. భారతదేశ సంపూర్ణ స్వాతంత్ర్యమునకై పాటుబడుట.

## కనీసకార్యక్రమము

సాంఘికం:—1. బాల్యవివాహాలు, వితంతువివాహాలు లేకుండుట, తల్లిదండ్రుల యిష్టమువచ్చినవారినే వివాహము చేసుకొనుట మొదలైన సాంఘిక దురాచారాలను పోగొట్టుట.

2. దయ్యాలు, మారెమ్మలు మొదలైన వాటిమీద ఉండే మూఢనమ్మకాలను పోగొట్టుట.

ఆర్థికం:— 1. పురుషులతోపాటు సమాన ఆస్థి హక్కులు సంపాదించుట, 2. స్త్రీ పురుషులకు ఒకేపనికి సమానమైనకూలి. 3. ఉచిత ప్రసూతి సౌకర్యాలు లెట్రిన్ సౌకర్యాలు సాధించుట.

రాజకీయం:— మీటింగు హక్కులు మొదలయిన రాజకీయ హక్కులను సంపాదించుట.

వైజ్ఞానికం:—1. స్త్రీవిద్య, రాత్రిపాఠశాలలు, గ్రంథాలయాలు, పత్రికాపఠనం ఏర్పరుచుట. 2. వంట, శిశుపోషణ, గృహనిర్వహణ, ఆరోగ్యము, మొదలగు విషయాలమీద ప్రచారం. 3. స్త్రీలశారీరకాభివృద్ధి ఆటలు, స్వీయరక్షణ నేర్పుట.

ఈ కార్యక్రమంలో స్థానికపరిస్థితినిబట్టి ఎక్కువమంది స్త్రీలనాకర్షించే విషయాన్ని తీసుకొని పనిచేయ్యాలి. సాంఘిక దురాచారాలనుగూర్చి ప్రచారం చేయవచ్చునుగాని వాటిని నిర్మూలించుటకు ముందు ప్రయత్నించరాదు. సంఘం బలపడినపుడు గ్రామంలోని పురుషుల సహకారాన్నికూడ పొందినపుడు ఆపనికి పూనుకోవచ్చును.

పురుషుల సహకారాన్ని పొందాలి:—స్త్రీలదుస్థితికి కారణం ప్రస్తుత సామాజికవిధానం. పురుషులలో అధికసంఖ్యాకులైన కూలిరైతులుకూడ దీనివలన బాధపడుతున్నారు. కనుక మహిళాసంఘాలు పురుషుల సహకారాన్ని పొందాలి స్త్రీ పురుషుల మధ్యనున్న వైరుధ్యం, పెట్టుబడిదారుల మధ్యనున్న వైరుధ్యంవంటిదిగాదు. కూలిపెట్టుబడిదారుల మధ్యనున్న వైరుధ్యం పెట్టుబడిదారీవర్గం నాశనంచేయబడి సోవియట్ విధానం స్థాపింపబడేవరకు ఉంటుంది. కాని స్త్రీపురుషుల మధ్య వైరుధ్యం కూలిరైతుమధ్యనున్న వైరుధ్యం వలెనే చాలావరకు సక్రమమైన కార్యవిధానం అవలంబించుటవల్లనే పోతుంది. కనుక మహిళాసంఘాలు కొంతమంది మధ్యతరగతియువతులు తలచునట్లు పురుషులకు వ్యతిరేక సంఘాలుకావు. పురుషుల సహాయ సానుభూతులను సంపాదించినప్పుడు మహిళాసంఘం తన కార్యక్రమాన్ని తేలికగా కొనసాగించ గల్గుతుంది.

# 5. వర్కరుల ప్రవర్తన— స్త్రీలతో సంబంధం పెట్టుకొనుట

వర్కర్ల ప్రవర్తన

1. వేషభాషల్లో సామాన్యంగా ఉండాలి. ఫాషనులకు పెనుగులాడరాదు.

2. పెట్టుబడిదారీవర్గ స్త్రీలవలె సామాన్య స్త్రీల కతీతులుగా ప్రవర్తించరాదు. సామాన్య స్త్రీలతో కలసిమెలసి ఉండి వర్కర్లు తమలోనివారనేభావం కలుగజేసి వారిమన్న నకు పాత్రురాలుగావాలి.

సంబంధం పెట్టుకొనుట

1. వర్కర్లు నివసించే చోటున ఉన్న స్త్రీల నిత్యజీవి తమునకు సంబంధించిన ప్రతి విషయంలోను జోక్యం కల్గించు కోవాలి.

2. పెండ్లిండ్లు మొదలైన శుభకార్యములలో చొరవ చేసుకొని మన పంథాన నడపడానికి చూడాలి.

3. పాతఆచారాలను పనికివచ్చేంతవరకు వినియోగించు కోవాలి. (ఉదా) అట్లతద్దె, ఉయ్యాలఊగుట, కొక్కుఆట వగైరా.

4. సామాన్యస్త్రీలకు కష్టసమయములందు సాధ్యమై నంతవరకు సహాయం చెయ్యాలి.

స్థానిక స్థితిగతులను తెలిసికొనుట.

ఒకచోట పని ప్రారంభించే ముందు అక్కడి పరిస్థితు లను పూర్తిగా అవగాహన చేసుకోవాలి.

ఘోషా మొదలైన మూఢఆచారాలు నమ్మకాలు ఎంతవరకు ఉన్నవి? మీటింగులకు వచ్చే అలవాటుందా? - గ్రామపార్టీలున్నవా? ముఖ్యవ్యక్తులెవరు? - ఇతర ప్రజాసం ఘాలున్నవా? - ఏమేకులాలవారున్నారు?

విప్లవ మితవాద పంథాలు.

ప్రస్తుత మున్న పరిస్థితులలో కార్యక్రమం కొంత వరకు నెరవేరినప్పటికి పూర్తిగా నెరవేరాలంటే ప్రస్తుత ప్రభు త్వాన్ని పోగొట్టి స్వతంత్రాన్ని సంపాదించాలనీ, అందుకుప్రజ లందరూ సమీకరించ బడాలనీ విప్లవవాదులు విశ్వసిస్తారు. సామాన్యస్త్రీలకు కనబడేదైనందిన కష్టాలమీద స్త్రీలను సమీకరించుచూ ఇది పూర్తిగా యీడేరడానికి జాతీయ ప్రభుత్వ సంపాదన, ఫేసిస్టుదాడినుండి దేశరక్షణావసరమని దెల్పుతూ రాజకీయచైతన్యం కలుగజేస్తారు. ప్రతిఘటనను రాజకీయంగా విపులపరుస్తారు. ఇదేమార్క్స లెనిన్‌ల కార్మిక వర్గపంథా.

మితవాద వైఖరి.

మితవాదులలో కొందరు అసలు రాజకీయాలతో సం బంధముండ రాదంటారు. ఏ విషయానికైనా ప్రజాసమీకరణ అవసరం లేదంటారు. ప్రస్తుత ప్రభుత్వాన్ని అలాగేఉంచి కనీస

కార్యక్రమాన్ని పిటీషనుల ద్వారా నెరవేర్చగలుగుతా మంటారు. (పిఠాపురం రాణి మరికొందరి రాజీనామా). ఇది జమీందారీ స్త్రీలయొక్క ఉద్యోగుల భార్యలయొక్క, బ్రిటిష్ ప్రభుత్వంతో కలసిపోయిన పెట్టుబడిదారీ ముఠా స్త్రీలయొక్క మితవాదపంథా.

జాతీయ మితవాదులు ప్రజానమీకరణను చేసినా, ప్రజలకు రాజకీయ చైతన్యం కలుగచేయరు. ప్రజలను వెనక నుంచుకొని ప్రభుత్వాన్ని భయపెట్టి కొన్ని సంస్కరణలు సంపాదించడమే వారి ఎత్తుగడ. మాటలో స్వాతంత్ర్యం అని చెప్పినా చేతలో శూన్యం. ప్రజలు విప్లవ పంథాన పోతుంటే వారికి అహింస మొదలైన నీతిసూత్రాల నడ్డంగా పెట్టి పెడమార్గాన పెట్ట ప్రయత్నించుతారు.

(1921-30-32 శాసనోల్లంఘనోద్యమాలు)

ఇప్పుడు స్వాతంత్ర్య సంపాదన పేరుతో, దేశవినాశనకరమైన విధ్వంసక చర్యలను చేస్తున్నారు. ఇది జాతీయ పెట్టుబడిదారీవర్గ స్త్రీలపంథా.

## 6 సాంఘిక విషయములను గూర్చిన సాహిత్యం

ఇతరకళలవలెనే ప్రతివర్గం తనకు అవుసరమయిన సాహిత్యాన్ని సృష్టిస్తుంది. అందువల్ల ప్రస్తుతసాహిత్యాన్ని 4 భాగాలుగా విభజించవచ్చు.

(1) పెట్టుబడిదారీవర్గ సాహిత్యం.
(2) మధ్యతరగతివారి సాహిత్యం.
(3) జమీందారీవర్గ సాహిత్యం.
(4) కార్మికవర్గ సాహిత్యం.

1. బ్రిటీష్ సామ్రాజ్యవాదులు మనదేశాన్ని జయించిన తరువాత రైళ్ళువేయడం, ఇంగ్లీషు చదువులుచెప్పడంతో పాశ్చాత్య నాగరికత మనదేశంలో దిగుమతి కావడం మొదలు పెట్టింది. దీనితో జమీందారీయుగపు ఆచారాలు, కట్టుబాట్లకు వ్యతిరేకంగా వైజ్ఞానికతిరుగుబాటు ప్రారంభమయింది ఆ కాలపు పెట్టుబడిదారీవర్గానికి సంబంధించిన సాహిత్యంలో ఇది ద్యోతకమవుతుంది. కాని అప్పుడు పెట్టుబడిదారీవర్గం సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని తన ఆదర్శంగా పెట్టుకోలేదు. భారతీయులకు ఉన్నతోద్యోగాలు మొదలైన కోర్కెలకోసం పిటిషన్లతోనే సంతృప్తిపడేది గాని ప్రజలను సమీకరించేదిగాదు. ఆరోజుల్లో ప్రభుత్వంస్వదేశసంస్థానాధీశులనుండిఅధికారం లాక్కోవలసియుండుటచేఅప్పుడప్పుడేఅభివృద్ధిజెందుచున్న పెట్టుబడిదారీ వర్గంయొక్క విద్యాధికులైన మధ్యతరగతి వారియొక్క సహాయంతీసుకొనేది. అందువల్ల సాంఘికసంస్కరణలు కొన్ని జేసేది. అందువల్ల ఆరోజుల్లో సాంఘిక సంస్కర్తలు ప్రభుత్వాన్ని పొగిడేవారు 1857 స్వాతంత్ర సమరంతో స్వదేశసంస్థానాధీశులతో ప్రభుత్వం రాజీపడింది. దానితో ప్రభుత్వం సాంఘిక సంస్కరణకుకూడ ప్రోత్సాహమివ్వడం క్రమంగామానుకుంది. ఆంధ్రదేశంలో ఈ సాహిత్యాన్ని పోషించినవారు కందుకూరి

వీరేశలింగం, చిలకమర్తి లక్ష్మీనరసింహం, పానుగంటి లక్ష్మీనరసింహంగార్లు. ఈ సాహిత్యం సాంఘికదురాచారాలను, మూఢనమ్మకాలనుగూర్చి విమర్శిస్తుంది.

క్రమంగా పెట్టుబడిదారివర్గం అభివృద్ధిఅయి అధినివేశస్వాతంత్ర్యం, తరువాత సంపూర్ణస్వాతంత్రం (1929 లాహోరు కాంగ్రెసు)తన ఆదర్శంగా పెట్టుకుంది అందుకు ప్రజలను సమీకరించడం మొదలుపెట్టిందిగాని, అహింస హృదయపరివర్తన సిద్ధాంతాలను వారికడ్డంపెట్టి విప్లవమార్గాన నడుచుటకు అభ్యంతరాలు పెట్టుతుంది. సాంఘిక దురాచారాలను విమర్శించినప్పటికి వీనిని పోగొట్టటానికి అహింసహృదయ పరివర్తనం మార్గమని తమ సాహిత్యంద్వారా చాటుతుంది. ఇది జాతీయ పెట్టుబడిదారీవర్గ సంస్కరణ మార్గము. జమీందారీ విధానం నుండి పూర్తిగా బయటబడని ఈ స్థితిలో పెట్టుబడిదారి సాహిత్యం కొంతఅభివృద్ధికరమైనదే.

2. మధ్యతరగతివర్గం (రైతులు, పట్టణ మధ్యతరగతి) నానాటికి క్షీణించిపోతూఉంది. అందుచే వారి సాహిత్యంలో కూడనిస్పృహాబహిర్గత మవుతూఉంటుంది. వారిఊహలు పెట్టుబడిదారీవర్గంలోకి పోవాలని. కాని వారి ఆర్థిక స్థితి కార్మికవర్గంవైపు దిగజారుతూ ఉంటుంది. కనుక ఆవర్గానికి సంబంధించిన సాహిత్యంలో ఏమోగారడీలు జరిగి కష్టాలు నివృత్తి అయినట్లుగా చిత్రించబడుతుంది. ప్రస్తుతసమాజంలోని వాస్తవిక నిజపరిస్థితులను ఈసాహిత్యం తెల్పకపోవడమేగాక నివృత్తిమార్గాలనుకూడ సరిగా చిత్రించదు. సాంఘికదురా

చారాలను వ్యక్తిగతంగా నిరోధించడంతప్ప వేరేమార్గం చూపదు. ఈరకానికిచెందిన సాహిత్యం చలం; కొవ్వాలి లక్ష్మీనరసింహంగార్ల పుస్తకాలు రైల్వేనవలలు, ఢంకా, చిత్రగుప్త మొదలైన పత్రికలు.

3. జమీందారీవర్గ సాహిత్యం ప్రస్తుతమున్న మూఢాచారాలను మూఢనమ్మకాలను సమర్థిస్తుంది. పాతపురాణాలు కావ్యాలు ఈ రకానికి చెందినవేకాని ప్రస్తుతపరిస్థితుల కన్వయించి జమీందారీయుగపు నాటిపద్ధతులను సమర్థిస్తూ వ్రాయబడినవి విశ్వనాథ సత్యనారాయణగారి పుస్తకాలే.

4. కార్మికవర్గ సాహిత్యం ప్రస్తుతసమాజంలోఉన్న కుళ్ళునంతా బట్టబయలుజేస్తూ ప్రస్తుతసమాజముపోయి సోషలిష్టు సమాజంవస్తే ప్రజలందరూ ఎలాసౌఖ్యంగా ఉంటారో తెల్పుతుంది. సోషలిష్టు సమాజాన్ని సాధించడానికి కార్మికవర్గనాయకత్వంక్రింద ప్రజలంతాఎలాఏకమవాలో తెల్పుతుంది. సాంఘిక దురాచారాలకు ఆర్థికపరిస్థితులు ఎలాకారణమో ఆర్థికపరిస్థితులు తొలగించితేనేగాని అవి ఎలాపోవో తెల్పుతుంది. అమ్మ.

ఈరకానికి సంబంధించిన పుస్తకాలు అమ్మ, నాడు నేడు, బీళ్ళుదున్నేరు మొదలైనవి. సాంఘిక దురాచారాల మీద ఈ వర్గానికి సంబంధించిన సాహిత్యం విరివిగా ఆంధ్ర భాషలో ప్రకటింపబడలేదు.

## కందుకూరి వీరేశలింగం, చిలకమర్తి, పానుగంటివార్ల సాహిత్యం

వీరిసాహిత్యంలో సాంఘికదురాచారాలు, మూఢనమ్మకాలు, చక్కగా విమర్శించబడినాయి. భాషగ్రాంథికభాష.

నవలలు, రాజశేఖరచరిత్ర, లంకాద్వీపము, ఆడమళయాళము. రాజశేఖరచరిత్రలో మూఢనమ్మకాలు, మూఢాచారాలవల్ల నాశనమయిన రాజశేఖరుని కుటుంబాన్నిగూర్చి వ్రాయబడింది. లంకాద్వీపంలో జ్యోతిషశాస్త్రంలోని బూటకత్వం విశదపర్చబడింది. ఆడమళయాళంలో ఇప్పుడు పురుషులు స్త్రీలను పెట్టేకష్టాలు స్త్రీలు పురుషులను పెట్టినట్లుగా వ్రాయబడింది.

ప్రహసనాలల్లో హాస్యరససంజీవిని అనేభాగం సాంఘిక దురాచారాలను మూఢనమ్మకాలనుగూర్చి వ్రాయబడింది. ఇందులో చిన్నచిన్న నాటికలు సాంఘిక సమస్యలనుగూర్చిన వ్యాసాలుగూడ ఉన్నవి. వానిలో ఆసమస్యలను గూర్చిన విషయుంచాలఉంది. చిలకమర్తి ప్రహసనాలల్లో సంస్కరణ హాస్యం సమానంగా పోషించబడినయి.

పానుగంటి లక్ష్మీనరసింహంకూడ ఈసమస్యలనే వ్యాసరూపంగా విమర్శించాడు. ఈవ్యాసాల నంపుటి సాక్షిఅనే నాలుగుభాగాల పుస్తకంగా ప్రకటించ బడింది.

## చలం సాహిత్యం

సమాజంలో ఉన్నకుళ్ళును గూర్చి చక్కగా వ్రాస్తాడు కాని కుళ్ళును పోగొట్టేమార్గం వ్యక్తిగతంగా సమాజకట్టు

బొట్లను ధిక్కరించడమే. అసలుకట్టుబొట్లు వ్యక్తిస్వేచ్ఛను అరి కడుతాయిగనుక కట్టుబొట్లనేవి పనికిరావంటాడు. కట్టుబొట్లు యాథార్థిక పరిస్థితులనుబట్టి మానవులు ఏర్పరచుకుంటారనీ, ఒకప్పుడు ఒకపరిస్థితుల్లో మానవసమాజం నడపడానికి ఉప యోగపడినవే ఆర్థికపరిస్థితులు మారేటప్పటికి హానికరంగా తయారవుతవనీ, అప్పుడు నూతనపరిస్థితులనుబట్టి మానవ సమాజానికుపయోగపడే నూతనకట్టుబొట్లను, మానవులేర్ప రచుకొంటారనీ ఈయనగ్రహించడు. ఈయన పుస్తకాలు దాదాపు అన్ని స్త్రీపురుష సంబంధాన్ని (Sex) గూర్చే వ్రాయబడినాయి. వీనిలో స్త్రీపురుష సంబంధమైన అరాచ కత్వాన్ని ప్రచారం చేస్తాడు. ప్రేమను పంచుకోమంటాడు. ఇదే ఆదర్శమైన (అన్నిరకాలకు పనికివచ్చే) ప్రేమ అంటాడు. ప్రేమనిశ్చలమైనది గాదని ఈయనగ్రహించడు. వ్యక్తి ఆస్తి రద్దుచేయబడి అందరికి సమానావకాశాలు కల్పించబడినపుడు ప్రేమకు గుణగణాలే ప్రధానమౌతాయి.

ఈయన పుస్తకాలలో చదవాలిసినవి స్త్రీ బ్రాహ్మణీకం బిడ్డలశిక్షణ. స్త్రీలో సమాజంలో స్త్రీ ఏవిధంగా హింసింప బడుతున్నదో విపులంగా వ్రాస్తాడు. కాని ఈ సాంఘిక దురా చారాలకుముందు ప్రేమను పంచుకోగలిగిన సహనం ప్రతిమా నవునికి ఉండాలంటాడు. బ్రాహ్మణీకంలో ప్రతిస్త్రీకి కావ లసిన ప్రపంచానుభవంవుంది. మూఢనమ్మకాలు ఆచారాలు ఉన్న స్త్రీ సంఘంలో ఏవిధంగా బాధపడుతుందో దానిని జీవి తానికి అన్వయించుకోవడానికి ప్రయత్నిస్తూ పడే హృదయా

వేదన, ప్రపంచానుభవం లేని స్త్రీ ఏవిధంగా బాధ పడుతుందో, మోసగింప బడుతుందో స్వభావసిద్ధంగా చిత్రించబడింది. బిడ్డల శిక్షణలో బిడ్డలను పెంచేపద్ధతి చక్కగా వివరించబడింది. ఇంకా ఈయన కథలలో మంచివి అనసూయ, మాదిగమ్మాయి, ఖర్మ మిట్లాగాలింది మొదలైనవి. అన్నిట్లోకి పనికి మాలిన పుస్తకం, మైదానం. దీనిలో పరిస్థితులు వాస్తవికంగా చిత్రించక పోవడమే గాక స్త్రీ పురుష సంబంధాన్ని గూర్చి చాల లోతుగా వెళ్ళాడు.

## కొవ్వలి లక్ష్మీనరసింహంగారి సాహిత్యం

ఈయన సాహిత్యం మధ్యతరగతి భావాలను వెల్లడించుతుంది. సాంఘిక సంస్కరణ ఆదర్శంగా పెట్టుకొనే వ్రాస్తాడు. కాని సమాజంలోఉన్న కుళ్ళును స్వభావ సిద్ధంగా చిత్రించడు, దానిని పోగొట్టడానికి ఊహా మాత్రమైన (Romantic) తేలిక యైన మార్గాలను చూపించుతాడు. దురాచారాలను పోగొట్ట డానికి సమాజంలో ఎదుర్కొవలసిన కష్టాలను చూపించుతాడు. అందువల్ల సమాజాన్ని గూర్చి నిజమైన దృష్టిని యీ సాహిత్యం కలుగజేయదు. కాని మధ్యతరగతి వారి ఊహలకు ప్రాధాన్యత ఇచ్చుటచేత, సంస్కరణ దృష్టి ఉండుటచేత, సాంఘిక సంస్కరణను గూర్చి ఎక్కువగా ఇతర దృక్పథాల నుండి సాహిత్యం లేకపోవుటచేత, శైలిసులభంగా ఉండుట చేత, ఈ సాహిత్యాన్ని విరివిగా చదువుతున్నారు.

## కాళ్ళకూరి నారాయణరావు, హనుమంతరావుగార్ల నాటకాలు

వీనిలో వరవిక్రయం, లేడీడాక్టరు, కాలేజిగరల్ మంచి నాటకాలు వీనిలోగూడ పెట్టుబడిదారీ దృక్పథంనుండి నేటిసాంఘికదురాచారాలు విమర్శించ బడినాయి.

## కన్యాశుల్కం

దీనిలో డబ్బుకోసం పిల్లనిఅమ్ముకునే దురాచారంగూర్చి చక్కగా వ్రాయబడింది. ఇప్పుడు ఆంధ్రదేశంలో ఉండే అన్ని రకాల మనుష్యులు వివిధపాత్రలో చిత్రించబడినారు. ఇది చదివితే చాలప్రపంచానుభవం వస్తుంది.

## మనఃస్వాతంత్ర్యం:—

రచయిత వల్లూరి సూర్యనారాయణ దీనిలో మూఢనమ్మకాలయొక్క మూఢాచారాలయొక్క పుట్టుపూర్వోత్తరాలు వివరంగా ఉన్నవి.

## విశ్వనాథ సత్యనారాయణ సాహిత్యం:—

చదువవలసిన పుస్తకాలు, వెయ్యిపడగలు చెలియలకట్ట. వీనిలో బాల్యవివాహాలు భోగంవృత్తి మొదలు పల్లెటూరి మంత్రసాని పౌరోహితులవరకూ అన్ని మూఢాచారాలను నమ్మకాలను సమర్థిస్తాడు. వెయ్యిపడగలనే పుస్తకంలో మూఢాచారాలను, మూఢనమ్మకాలను సమర్థిస్తూ వ్రాస్తాడు. చెలియలకట్ట అనేదానిలో స్త్రీవిద్యకు వ్యతిరేకంగా వ్రాశాడు.

## కార్మికవర్గ సాహిత్యం: —

అమ్మ. దీనిలో పెట్టుబడి దారివిధానంలో దోపిడీవిధానం ఎలాఉండేదీ, నిరుద్యోగం మొదలైనవి ఎలావచ్చేవీ, అందుకు కార్మికులు సంఘాలు పెట్టుకుని పెట్టుబడిదారి విధానంతో ఎలా పోరాడేదీ, కార్మికులమధ్యనుండే కమ్యూనిస్టులు ఎలాబయలు దేరి ఉద్యమాన్ని విప్లవపంథాన నడిపేదీ స్వభావసిద్ధంగా వ్రాయబడింది ఏమీ తెలియని అమాయకురాలైన పావెల్ తల్లి క్రమక్రమంగా వర్గచైతన్యంగల కార్మికస్త్రీగా ఎలాతయారయిందీ వ్రాయబడింది. అంతేగాక ఆదర్శంకోసం పాటుపడుతూ దైనిక కార్యక్రమ నిర్వహణలో ఒకరినొకరు పూర్తిగా అర్థముచేసుకొనుటవలన పావెల్ శశాంకలమధ్య ఉన్న స్నేహం ధనికుల మతములతో నిమిత్తంలేకుండా ఎలాప్రేమగా అభివృద్ధిఅయిందో స్వభావసిద్ధంగా చూపింపబడింది. ఇదేకమ్యూనిస్టు స్త్రీపురుష సంబంధమైన ప్రేమ.

## నాడునేడు: —

దీనిలో పెట్టుబడిదారీ విధానంలో నిరుద్యోగంవల్ల కార్మికకుటుంబాలు ఏలావిచ్ఛిన్నమయిపోయేదీ, దిక్కులేని పిల్లలు నీతినియమాలుతప్పి ఎలా ప్రవర్తించేదీ, వ్యభిచారవృత్తి ఎలా స్వీకరించేదీ, చక్కగా వ్రాయబడింది. అంతేగాక జారుకాలంలో నీతినియమాలు పోగొట్టుకొని ఒక గజదొంగగా తయారయిన ఒక కార్మిక కుటుంబయువకుడు సోవియట్ విధానంలో చెడు ప్రవర్తనను పోగొట్టుకొని ఒక పెద్దఇంజనీరు ఎలా అయింది వ్రాయబడింది.

బీళ్లుదున్నేరు:—

ఈ నవల సోవియట్ యూనియన్‌లోని సమిష్టివ్యవసాయక్షేత్రంలోని జీవితాన్నిగూర్చి వ్రాయబడింది. సమిష్టి వ్యవసాయ విధానాన్ని నిర్మించడానికి పడేకష్టాలు, కమ్యూనిస్టు పార్టీ సభ్యులు స్వార్థత్యాగంతో పనిచేసి ఎలాసోవియట్ యూనియనును అభివృద్ధి చేసేది వివరించబడింది. అంతేగాక పెట్టుబడి విధానంవల్ల పతనమయిన స్త్రీ ఎలాసోవియట్ విధానంలో సంస్కరించబడి ఉన్నతస్థితికి వచ్చిందీ వివరించబడింది.

## II స్త్రీల హక్కులు

స్త్రీలహక్కులచరిత్ర;—పాశ్చాత్య దేశాలలో కూడా మొట్టమొదట స్త్రీలస్థితి ఈ దేశంలో ఇప్పుడు ఉండేదానికంటే హీనంగానే ఉండేది. భార్యకు ఆస్తిసంపాదనకుకూడా హక్కు ఉండేదికాదు. ఆమె సంపాదించిన ఆస్తి భర్తకు చెందవలసినదే ఆందోళన ఫలితంగా మార్పులు జరిగేయి.

హిట్లరు, ముస్సోలినీలు యూరోపుస్త్రీలను మళ్ళా వెనుకకు తోసేశారు. జర్మనీలో హిట్లరు అధికారమునకు రాకపూర్వము వేమెరు ప్రణాలికలో స్త్రీలకు పురుషులకు సమాన హక్కులుండేవి. అచ్చట ఇంగ్లండు అమెరికాలలోకంటె చాల మందిస్త్రీలు ముందుకువచ్చి రాజకీయాలలో పాల్గొనేవారు. పడకొట్టటానికి వందలకొలదిఏండ్లు పట్టేటువంటి అడ్డులన్ని చటుక్కున నిర్మూలింపబడ్డాయి. టర్కీలో కూడా అలాగేజరిగింది. సోవియట్ సంగతి చెప్పనవసరంలేదు.

జర్మనీలో హిట్లరువచ్చినంతనే ఆ హక్కులన్నింటిని నాశనంచేసి పురాతన అలవాట్లును పైకితీసుకుని వచ్చినాడు. ఈతనిరాజ్యంలో ఆడవాళ్ళకు ఇచ్చినహక్కులు మూడే—పూజ పునస్కారాలు 'వంటపని' బిడ్డలను కనటం.

## 2. హిందూన్యాయశాస్త్రంలో స్త్రీలహక్కులు

సున్నా అనిచెప్పవచ్చును. దేశసాధారణలాలో హక్కులకు హిందువులకు వర్తించే న్యాయశాస్త్రంలో హక్కులకు హస్తిమశకాంతరముతేడా వున్నది. హక్కులు రెండువిధాలు సామాన్యహక్కులు Public rights సొంతహక్కులు Persoal rights

## 3. సామాన్యహక్కులు

లాలో కట్టుబాట్లేమిలేవు. స్త్రీపురుష విచక్షణలేదు. అయితే సాంఘికముగా అనేకకట్టుబాట్లున్నవి. ఉదాహరణ ముస్లిములలోను హిందువులలోను కొన్నివర్గాలలోను ఉన్నత ఉద్యోగాలలోమాత్రం స్త్రీలకు పురుషులకు సమాన హక్కులులేవు. చెప్పేకారణాలు—స్త్రీలు అబలలు వారికి ప్రసవాది సంకటములు వుండటం ఇవన్ని కుంటికారణాలని సోవియట్ ఋజువుచేసినది.

ఆందోళన మూలంగా ఇచ్చటకొన్ని ఉద్యోగాలలో స్త్రీలను ప్రవేశింపనిస్తున్నారు. టైపిస్టులు, గుమాస్తాలు, టీచరు, అడ్వకేట్లు,డాక్టర్లు,నర్సులు మొదలైనవి. కూలిపనులలో మాత్రం అష్టకష్టాలుపెట్టి పనిచేయించుకుంటున్నారు ఈపెట్టు

బడిదారులు కూలీలతోకూడా స్త్రీపురుష వివక్షణచూపి స్త్రీలకు తక్కువకూలినిచ్చి దోచుకుంటున్నారు.

ఈ ప్రవేశింపసచ్చేకొద్ది ఉద్యోగాలలోగూడా స్త్రీలను పురుషులు అసూయతోను, హీనముగాను చూస్తున్నారు.

ఉదాహరణ పెండ్లిచేసుకున్న స్త్రీ ఉద్యోగానికి అనర్హురాలు ఉద్యోగంలోనున్న స్త్రీ పెండ్లిచేసుకుంటే ఉద్యోగాన్నించి తొలగించటం గర్భిణీస్త్రీలకు తగినసెలవులు అలవెన్సులు ఇవ్వకపోవటం యుద్ధఅవసరాన్నిబట్టి చాలాఉద్యోగాలలో స్త్రీలను రానిస్తున్నారు. యుద్ధఅనంతరం వీరిలావుంటారా అనేది చూడవలశిన విషయం.

4. స్వంతహక్కులు వారసత్వపు హక్కులు:- హిందూ న్యాయశాస్త్రం ఈవిషయంలో చాలావెనుక బడినది, పురాతన న్యాయాన్నే అమలులోపెట్టి ముందుకుసాగనీయకుండా స్త్రీలను చాలహీనమయిన స్థితిలో నుంచుతోంది. మహమ్మదీయులలో ఇంతఅన్యాయంకాదు. కొంత మెరుగు హిందువులలో అవిభక్త కుటుంబం పురాతనపద్ధతి ఇందులో పురుషులకి కొంత వరకు స్వంతహక్కులుండవు స్త్రీలవిషయము చెప్పనవసరమే లేదు. వారికి మనవర్తి (పశువులకు తిండిపడేశేటట్లు) ఒకే హక్కు 1937 సం॥లో దేశముఖుఆక్టు ప్రకారం కొంతవరకు ఈ అవిభక్త కుటుంబములో స్త్రీలస్థితి మార్పుచెందినది. కాలంచేసిన మెంబరుయొక్క వాటాకు భార్యహక్కుదారాతుంది.

కుటుంబములోనుంచి వేరుపడిన వ్యక్తి మాటేమిటి? అతని ఆస్తికి కొడుకులు మనుమలు మునిమనుమలు హక్కు-దారులు. వారుండగా భార్యకేలాంటిహక్కు లేదు. మనువర్తి తప్పితే

దర్మశాస్త్రంలో పుత్రుడుఅంటేనే పుత్ర పౌత్ర ప్రపౌత్రులని అర్థము. ఈలాగే పుత్రులు (మూడుతరాలవారు. లేకపోతే భార్య) దేశముఖు ఆక్టుదీనిని కొంతమార్పుచేసి కొడుకులున్నప్పటికి భార్యకు వారితోసమానమైన వాటానిచ్చినది.

భార్యలేకపోతే ?
కూతురు—కూతురులేకపోతే ?
కూతురుకొడుకు—అతడూలేకపోతే ?
తల్లి—ఆమెలేకపోతే ?
తండ్రి—ఆతడూలేకపోతే ?
అన్నదమ్ములు—వారులేకపోతే
వారిపుత్రులు—

ఈలాగు పదునాలుగు తరాలవరకుజ్ఞాతులు:- జ్ఞాతులంటే పురుషులమూలంగా సంబంధం కలిగినబంధువులు ఈ జ్ఞాతులు ఎవరూలేకపోతే బంధువులు- అంటె- స్త్రీమూలంగా సంబంధం కలిగినవారు. వీళ్ళల్లోకూడా పురుషులకీ హక్కు స్త్రీలకీలాటి హక్కున్నూ లేదు. అంటే అక్కచెల్లెండ్రు ఉంటే వారికాస్తిలో ఏలాటిహక్కున్నూ లేదన్నమాట. పురుష బంధువులెవరూ లేకపోతే ఆ ఆస్తిగవర్నమెంటుకైనా చెంద

వలసిందేకాని ఎంతటిదగ్గరబంధువైనా ఆమెకురాదు. శాస్త్రంలో పేర్కొనపడినందువల్ల వచ్చింది భార్యకూతురు. తల్లి, వీరికి వారసత్వపుహక్కు ఉదాహరణ;- మేనత్తకొడుకుంటే ఒకప్పుడైనా అతనికి ఆస్తిసంక్రమింప వచ్చును. (జ్ఞాతులూ అంతకంటే దగ్గరబంధువులు లేనప్పుడు) కాని మేనత్తకుమాత్రం ఎప్పుడూ హక్కులేదు. అలాగే అక్కకుమారునికి రావచ్చును. అక్క కెప్పుడూరాదు. (హిందూలా)

ఇంతేకాక పురుషబంధువులకుకూడా వారిబంధుత్వం స్త్రీద్వారా కలిగిందైతే వారిహక్కు వెనకపడుతుంది. ఉదాహరణ మేనమామ కుమారుడు చాలా దగ్గరబంధువు. అయినప్పటికి ఏఆరో ముత్తాతకు ఆరో మునిమనమడున్నానని వస్తే, అతనికే మొదటిహక్కు. ఎందుకిది? అంటేవాని బంధుత్వం పురుషుల ద్వారా కలిగింది కాబట్టి. మేనమామకుమారుడిది స్త్రీ సంబంధమువల్ల కలిగిన బంధుత్వముకాబట్టి.

ఇదంతా 1929 లో ఆక్టుమూలంగా జరిగిన అన్యాయం ఈవారసత్వపు హక్కు గల స్త్రీలపట్టీకి ఇంకాముగ్గురనుచేర్చారు కొడుకుకూతురు, కూతురుకూతురు, అక్కచెల్లెండ్రు ఈముగ్గురిని సోదరికుమారునికి తండ్రిసోదరు' కి ముందు బెట్టారు.

ఈ 1929 సం॥ ఆక్టును 1937 సం॥ ఆక్టును లెక్క వేసుకున్నా, స్త్రీవారసులెందరు? (1) భార్య, (2) కూతురు, (3) తల్లి, (4) కుమారుని కుమార్తె, (5) కుమారైకుమార్తె (6) సోదరి, ఆర్గురు!

ఇపుడు రావుకమిటీబిల్లు మాత్రం ఏంచేస్తుంది? ఈ లిష్టుకు ఇంకకొందరిని కలుపుతుంది. అంతే స్త్రీ పురుష విచక్షణకాని, హిందూలాలో వారసత్వమునకు స్త్రీత్వము మీాద నిషేధాన్నికాని తొలగించటములేదు. కొందరిస్త్రీలకు సమాన బాంధవ్యము కలిగిన పురుషులతోపాటు వారసత్వపు హక్కును ఇచ్చినప్పటికి వాటామాత్రం స్త్రీకి పురుషుని వాటాలో సగం ఇస్తూ ఈస్త్రీపురుషవిచక్షణను ధృవపరుస్తూనే యున్నవి.

## జీవితకాలంవరకే హక్కు

ఈకొద్దిమంది స్త్రీలకుండే ఈవారసత్వపు హక్కు కూడా సర్వస్వతంత్రమైనదికాదు. ఏస్త్రీకైనప్పటికి వారసత్వము మూలాన తనకు సంక్రమించిన ఆస్థిని అత్యసరమైనపుడు తప్ప, ఇతరత్రా అమ్మడానికిగాని, వినియోగంచెయ్యడానికిగాని, ఇక ఏలాటి పరాధీనంచెయ్యడానికిగాని హక్కు లేదు. ఈఅవసరాన్ని నిర్ణయించేది కోర్టు. ఫలితం-న్యాయాలు-పురుష వారసులలో తగాయిదాలు.

## స్త్రీ ధ న ం

తాను సొంతంగా సంపాదించుకున్న ఆస్తిమీాదమాత్రం స్త్రీకి సర్వస్వతంత్రము కలదు. ఈ హక్కు మాత్రం ఇచ్చింది న్యాయశాస్త్రం, పాశ్చాత్యస్త్రీలకు కూడా ఈహక్కు కొన్ని శతాబ్దముల క్రిందనే కలిగింది. అయితే యీా స్త్రీధనం కూడా మరొక స్త్రీకి వారసత్వమూలాన వెళ్లితే ఆవిడ చేతిలో అది జీవితకాలము వరకు నుండగలదు.

యీరావుకమిటీబిల్లులో ఒక మెరుగయిన అంశము, జీవిత కాలము వరకే అనుభవించవలసినది, అనే బంధాన్ని తొలగిస్తుంది. ఆ స్త్రీమీద సర్వస్వాతంత్రముయిస్తుంది. స్త్రీలకుకూడా.

## పరివర్తన

వారసత్వపుహక్కు స్త్రీ పరివర్తన మీద ఆధారపడి యుంటున్నది. హిందూ న్యాయశాస్త్రంలో దీనివల్ల కలిగే బాధలు, వారసులనుండి అన్యాయపు ఒత్తిడి, వ్యాజ్యాలు, రావుకమిటీబిల్లు వీనిని తొలగించటం లేదు. కాని దీనివల్లకలిగే భాధను తగ్గించటానికి ప్రయత్నిస్తుంది. (ప్రజాశక్తి వ్యాసాలు చదవండి.)

## వితంతువులు

పునర్వివాహము మూలాన మొదటి భర్తనుండి సంక్రమించిన ఆస్తిని కోల్పోవలసి యుంటుంది. రావుకమిటీ బిల్లులో స్త్రీలకు సర్వస్వాతంత్ర్యము యిచ్చేటప్పుడు ఈ కోల్పోవటము అనవసరమైన చిక్కులకు దారితీస్తుంది.

## మహమ్మదీయులలో

కొంచెము మెరుగు. స్త్రీల హక్కులలో వారసులు మూడు తరగతులవారు. (1) వాటాదారులు, (2) శేష భాగులు (3) దూరబంధువులు. (1) వీరిలో స్త్రీలు: భార్య సంతానముంటే 1/8 వంతు లేకపోతే 1/4 వంతు, తల్లి 1/6 వంతు, కూతురు (ఒకతె) 1/2, ఎక్కువమంది అయితే 1/2

(కొడుకులు లేకపోతేనే) కొడుకున్నా వారితోబాటే శేష భాగత్వము.

కొడుకుకూతురు 1/2, అక్కచెల్లిండ్రు1/6, పై మోస్తరుగానే మహమ్మదీయలాలో పురుషులవాటా స్త్రీల వాటా కంటే రెండింతలెక్కువ.

---

## III వివాహము—విడాకులు

1. చరిత్ర:- పురుష స్త్రీ సంయోగమునకుగాను వివాహము ఏర్పడింది. ఇది మానవుల కత్యవసరము. సంఘములో ఆర్థిక పరిస్థితులనుబట్టి దీని విషయములోని కట్టు దిట్టాలను గూర్చిన ఆచారము లేర్పడి, అట్టి అచారాల కనుగుణ్యంగా న్యాయశాస్త్రాలు, శాసనాలు ఏర్పడినవి.

ప్రపంచములో ప్రతి సంఘములోను ప్రతిదేశములోను దీని విషయములో కట్టుబాట్లేర్పడినయి. ఆర్థికంగా వర్గభేధాలేర్పడి సంఘంలో ఒకమనిషి యింకొకమనిషికష్టాన్ని తన స్వంత లాభాని కుపయోగించడమనేది తటస్థించినపుడే స్త్రీలు పురుషులసుఖాల కాటబొమ్మలుగా పరిగణింపబడుట తటస్థించింది. దీనినిబట్టి అన్నిదేశాలలో స్త్రీలు పూర్తిగా వారివ్యక్తిత్వాన్ని గోలుపోయి పురుషులకు బానిసలుగా ఏర్పరుపబడినారు.

2. హిందూవివాహం:- సంస్కారం, వివాహము వ్యక్తులయొక్క స్వంతహక్కు బాధ్యతలే అనేది గుర్తించలేదు.

**8. హిందూలా వివాహము మతసంబంధమైన సంస్కారము.**

8 ఏండ్లలోపల వివాహము చేయవలసిన బాధ్యతతండ్రిది. ఆందోళనమూలంగా1930లో శారదఆక్టు దీనిని రద్దుచేసి 14ఏండ్ల లోగా పెండ్లి చేయకూడదని 1930 లో శాసించింది. కానిప్రజలు ఆచరణ లో పెట్టడంలేదు. పుదుచ్చేరిలో, నైజాములో చిన్న పిల్లలకు పెండ్లి చేయించుకుని వచ్చేవారు. ఎవరోఒకరు కోర్టులో డబ్బుడిపాజిటుచేసి కంప్లెయింటు పడే స్తేకాని వ్యవహారం జరిపించ డానికి వీలులేదు. 1938 లో యీ రెండంశములలోను మార్పు వచ్చింది. ఎక్కడచేసినా నేరమే. కోర్టేచర్యతీసుకోవచ్చు. అయి తే యీ శారదాఆక్టులోకూడా 14 ఏండ్ల లోపుగా వివాహం జరిగించితే, జరిపించేవారిమీద చర్యతీసుకోవడానికి వీలుందే కాని వివాహం ఆపడానికవకాశంలేదు.

బాల్యవివాహాలవల్లనష్టం:- 1 అసంతృప్తితోటి సంసా రం 2 వితంతువులసంఖ్య ఎక్కువ 3 ఆరోగ్యం క్షీణించటం 4 వ్యభిచారానికి దోవదీయడం 5 బలహీనమైనబిడ్డలు 6 స్త్రీ అభివృద్ధికి ఆటంకాలు 7 ఆర్థిక బానిసత్వం.

4 వివాహాల రకాలు:- ధర్మశాస్త్రంలో 8 రకాల వివా హాల్ని గురించి చెప్పినారు. అందులో ముఖ్యమైనవి 1 బ్రాహ్మ (కన్యాదానం) 2 అసుర (తండ్రికి డబ్బిచ్చికన్యను తీసుకోవడం 3 గాంధర్వ, (ప్రేమపూర్వకంగా అన్యోన్య ఒడంబడికతో చేసు కొనేది.) 4 రాక్షస, కన్యను పట్టుకొనిపోవడం.

గాంధర్వం, రాక్షస, మొదలయినవి నిషేధింపబడినవి. బ్రాహ్మ, అసుర, అమలులో నున్నవని గుర్తించడంలోను, గాం

ధర్మం కలియుగానికి పనికిరాదని చెప్పడంలోను, మనశాస్త్రంలో స్త్రీలను తండ్రులు, భర్తలు వారి సొంత ఆస్తిగా పరిగణించు తున్నారనేది తెలుస్తుంది.

5 నిషేధం లేకపోయినా వివాహం పూర్తయితే భార్య భర్త సొమ్మయిపోతుంది. మన ధర్మశాస్త్రంలో అమ్ముకో వచ్చునుకూడ. యిప్పుడది ఆచారంలో లేదు. కాని భార్యయిం కొకరితోపోతే భర్తఇష్టపడితేనేరంలేదు. యిష్టపడకపోతేనేనేరం అంటే భార్యమనిషిగా పరిగణింప బడలేదన్నమాట.

6. పురుషు లెందరినయినా చేసుకోవచ్చు స్త్రీలలా చేసుకోవడానికి వీలులేదు. అట్లాచేస్తే "బిగం" బహు (అంటే బహు భర్తృత్వము) అనేనేరానికిగాను చర్యతీసుకుంటారు. ఈ విషయంలోరావు కమిటిబిల్లు తెచ్చేమార్పు పురుషులు కూడ భార్యబ్రతికియుండగా ఇంకొక భార్యను చేసుకొన గూడదని.

7. వితంతు వివాహము:- శాస్త్రంలోనిషేధం శాసనం చేసుకోవడానికి హక్కిచ్చింది. బెంగాలులో బ్రహ్మసమాజిష్టుల ఆందోళనమూలాన 1856 లో యీశాశనం వచ్చింది. అయితే ఆచరణలో ఏకొద్దిమందో చేసుకోగలిగారు. అంటే సంఘంలో మార్పుకలుగలేదు. ఆందోళన, ప్రచారం, విజ్ఞానం కావాలి. సంఘంలో మార్పుతేవడానికి వితంతువులుపునర్వివాహంచేసుకో వచ్చునని శాసనమున్నప్పటికీ యిలాచేసుకోకుండా వితంతువు లుండటమేలా సంభవించుచున్నది. అంటే 1 సంఘంవలనబాధ

2. భర్తఆస్తినికోలు పోతామనేభయం, 3. విజ్ఞానవినూనత 4. ఆర్థిక అస్వతంత్రత.

8. కండిషనులు:- (1) ఒకేవర్ణానికి చెందియుండాలి, (2) సగోత్రులు, సపిండులుకా నుండరాదు. (3) వివాహానికి తంతుఅత్యవసరం-అగ్ని హోత్రం కన్యాదానంపాణిగ్రహణం-సప్తపది-మంగళసూత్రం-పూలమాలలు మార్చుకోవడం. (4) ఎంత వయస్సు వచ్చినా ఎవరోఒకరు దానంచేయువలసినదే.

9. వర్ణేతర వివాహాలు;- ఆచారంలో ప్రబలంగా ఉంటున్నవి. కోర్టులో చెల్లదనిరి తీర్పులు. అంటే సంస్కార రూపేణ చేసుకున్న వివాహామయితేనే. వర్ణేతర వివాహాలు ఇప్పుడుకూడ రిజిస్ట్రేషనురూపముగా చేసుకోవచ్చు. రావు కమిటీ బిల్లులోసంస్కార వివాహానికిది కండీషనుగా నుంచి నప్పటికి పెండ్లిఅయిపోతే ఈకారణాలనుబట్టిమాత్రము ఆపెండ్లి చెల్లదని చెప్పడానికి వీలులేదని సవరణ.

10. సపిండసగోత్రవివాహములు:— నిషేధము లయి నప్పటికి దక్షిణయిండియాలో కొందరు బంధువులతో వివాహం ఆచారంలోవుంది. ఉదాహరణ: అక్కకూతురు, మేనమామ కూతురు, మేనత్తకూతురు. రావుకమిటీ బిల్లులోకూడ యీ ఆచారాన్ని గుర్తించారు.

11. తంతు విషయంలో రావుకమిటి బిల్లులో అగ్ని హోత్రం, సప్తపది అత్యవసరమయిన తంతులుగా ఏర్పరచారు. సప్తపది పూర్తిఅయితేనే వివాహం పూర్తిఅయినట్లు.

12. వయసువిషయంలో రావుకమటి బిల్లులో స్త్రీకి పదహారేండ్లువస్తే తండ్రియిష్టం లేకుండానే వివాహం చేసుకో వచ్చునని సవరణ తెస్తున్నారు. ఇది సంస్కార వివాహానికి వర్తిస్తుంది.

13. హక్కుబాధ్యతలు:- (1) సంస్కారానికి హక్కు బాధ్యతపరస్పరం. భార్యకు వేరేవుండడానికి హక్కులేదు, కాని భర్తక్రూరత, ఆతనిదగ్గర తనజీవితమే కష్టమని రుజువయితే అప్పుడు వేరేఉండవచ్చు, భర్త కామెను పోషింపవలసినబాధ్యత ఉంటుంది. (2)భార్య, బిడ్డలను పోషించడం, భర్త బాధ్యత. (3) వారసత్వపుహక్కు. (యింతవరకే చెప్పబడినది)

14. విడాకులకు హక్కులేదు:— ఎంతచిన్నవయసులో ఎవరిచే పెండ్లిచేయబడినప్పటికి దానివలన కష్టాల నన్నిటిని అనుభవించి తీరవలసినదేస్త్రీలు. రావుకమిటీ బిల్లులోకూడ సంస్కార వివాహానికి విడాకులులేవు. ఎప్పుడో వేరేవిడాకుల బిల్లు తెస్తారట,

15. ఒప్పుదల వయసు:— 14 ఏండ్లుచేశారు. అంటే తండ్రియెప్పుడు వివాహం చేసినా భర్తయీ 14 ఏండ్లకుముందు సంసారము చేయరాదు. కన్యఒప్పుకున్నా అది ఒప్పుదలలో లెక్కకాదు ఒకస్త్రీతో14ఏండ్లలోపునకాపురంచేస్తేనేరంఅయితే ఆచరణలో తల్లిదండ్రులకు, భర్తలకు, విజ్ఞానము తక్కువయి, యీనేరంరోజూ జరుగుతూనే యున్నది, అనేక యిండ్లలో బయటపడకుండా, ఇదిస్త్రీల ఆరోగ్యానికి చాలాచెరుపు.

శాసనానుసరణ వివాహాలు:-

1. ఆనంద మేరేజ్ ఆక్టు:— ఇది సిక్కులకు వర్తిస్తుంది. సిక్కులఆచారాలలో వివాహానికి హిందువులలో మాదిరి అంత తంతులేదు పూలమాలలు మార్చుకోవడం 'ఆనందు' అను సిక్కుమత పుస్తకములోనుంచి కొన్ని మంత్రాలను చదవడం అంతే. చాలాకాలం ధర్మశాస్త్రరీత్యా యిదిచెల్లదని కోర్టులలో తీర్పులువస్తే శాశనసభలు యీ ఆచారాన్ని గుర్తించి యీ శాసనం తెచ్చారు.

2. ఆర్యసమాజ మేరేజి ఆక్టు:— పైమోస్తరుగానే ఆర్యసమాజములో చేరినవారు తంతును తగ్గించి వివాహాలు నిరాడంబరముగా అగ్నిసంస్కారాలు లేకుండా చేయుడ మాచరణలో పెట్టేసరికి శాసనరూపంగా యీ ఆచారం కూడా వివాహంగా గుర్తింపబడినది. దీని ప్రకారం పురుషుడు స్త్రీ ఆర్యసమాజంలో చేరిన, వారలు నిరాడంబరముగ పదిమంది స్నేహితులు, బంధువులయెదుట వడంబడిక రూపంగా వివాహం చేసుకోవచ్చు. అయితే యీ ఆనంద వివాహానికిగాని, ఆర్యవివాహానికిగాని, హిందూలామోస్తరుగానే, విడాకులు లేవు.

3. మలబారు మ్యారేజి ఆక్టు:— పైవిధముగానే మలబారు ప్రజలకు ఒక ఆక్టువున్నది.

4. స్పెషల్ మారేజి ఆక్టు:— రిజిస్ట్రేషను మారేజి అంటారు దీనిని.

కండిషనులు:— (1) వివాహము చేసుకునే వారిద్దరు తాము ఏ మతానికిగాని చెందినవారము కామని డిక్లరేషనివ్వాలి (2) భార్యకింకొక భర్తగాని, భర్తకింకొక భార్యగాని జీవించియుండగా కూడదు. అంటే బహుభార్యాత్వము, బహుభర్తృత్వముని షేధము. (3) భార్యకు 14 ఏండ్లు, భర్తకు 18 ఏండ్లు ఉండాలి. అయితే భార్యా-భర్త 21 ఏండ్లులోపలివారయితే తండ్రిలేక గార్డియను అనుమతితోనే యీ విధానంలో వివాహం చేసుకోడానికి అర్హులవుతారు. (4) పదునాలుగు రోజులు నోటీసివ్వాలి. (5) రిజిష్ట్రారు ముందు సంతకాలు పెట్టాలి ముగ్గురు సాక్షులతోసహా (6) ఈ విధంగా వివాహం చేసుకున్నవారి విషయములో భర్త తన కుటుంబములో నుండి వేరయిపోతాడు. అతనిఆస్థికివారసులుహిందూలా ప్రకారముకాక సక్సెషను ఆక్టుప్రకారం ఉంటారు. బి.యస్. రావుకమిటీబిల్లులో యీ కడపటి విషయంలోమార్పు. యీ విధానంలో వివాహం చేసుకున్నప్పటికి కుటుంబములోనుంచి వేరుపోవు అవుసరము లేదని హిందూలాప్రకారమే వారసత్వపుహక్కు లుంటాయని. (7) దగ్గరబంధువు లీవిధంగా చేసుకోవడానికి వీలులేదు. నాలుగు తరాలకు నిరోధం. రావుబిల్లులో ఈ విషయాన్నిగూర్చి మార్పు. మేనమామకూతురును మాత్రం చేసుకోవచ్చుననిరి. యీ విధాన రూపంగా వివాహమయితే విడాకులకు హక్కుంటుంది.

విడాకులచట్టం:— హిందూలా వివాహాలకువర్తించదు. రావుబిల్లులో దీనికేమీ సవరణలేదు. ఎప్పుడో వేరేబిల్లు తెస్తామనిమాత్రమే. రిజిస్ట్రేషను మారేజికి వర్తిస్తుంది.

భార్యకుహక్కు:— భర్త వ్యభిచారంచేసి భార్య ఎడల క్రూరప్రవర్తనచూపిస్తేనే.

భర్తకుహక్కు:— భార్య వ్యభిచారంచాలు. బిడ్డలు భర్తకు స్వంతం.

విడాకులు తీసుకుంటే కోర్టువారు భార్యయింకొక వివాహము చేసుకునేవరకు పోషణకు ఏర్పాటు చేయించవచ్చును.

దాసీత్వం:- దాసీలంటే వివాహ తంతేమీ లేకుండా ఒక పురుషునితోనే సంసారముచేస్తూ, భార్య ననిపించుకోకుండా ఉండడం వీరికి న్యాయశాస్త్రంలో కొన్ని హక్కులున్నవి. 1. పోషణకు, 2. వారికిపుట్టిన బిడ్డలకన్ని వర్ణాలవారిలోను, పోషణకుహక్కు. శూద్రులలో అట్టి పుత్రులకు వారసత్వపు హక్కున్నది.

రావుబిల్లులో ఈదాసీ పుత్రులకు, దాసీలకు, ఉండేహక్కులను తీసేస్తున్నారు. వారిఉద్దేశము యిట్టిదాసీలుసంఘంలోఉండ కూడదనికాని అట్టిదాసీలు బయులుదేరడానికి అనుగుణ్యమయిన ఆర్థికవర్గఆధిపత్యం తొలిగితేనేకాని సంఘంలో ఈవిషయంలో మార్పురాదు. ఈ శాసన రూపమయిన మార్పులు వారిఆర్థిక దుస్థితిని ఎక్కువజేస్తుంది. సంఘంలోముఖ్యంగా వ్యభిచారానికి కారణాంగా ఉండే స్త్రీల ఆర్థికదుస్థితి, బాల్యవివాహాలు, విడాకులు లేకపోవడం, వాటిని తొలగించాలి.

ఈవిషయాలలో ప్రజాశక్తిలో వచ్చిన రెండు వ్యాసాలను జాగ్రతగా చదువవలసినదని హెచ్చరిక.

# IV. సంఘ సంస్కరణోద్యమము

హిందూసమాజానికి ఒకన్యాయశాస్త్రం నీతిసూత్రాలు వ్రాసింది మనువు. అతనిచే రచింపబడిన మనుస్మృతి ననుసరించియే వేలకొలది సంవత్సరాలనుంచి నేటివరకూ కొద్ది గొప్ప మార్పులతో హిందూమతానికి చెందినవారు పరిపాలింపబడుతున్నారు. బ్రిటిషువారు మనదేశాన్ని జయించిన తరువాతి గూడ, ఆమనుస్మృతి ననుసరించివ్రాయబడిన హిందూన్యాయశాస్త్రము అనుసరించబడుచున్నది. మనుస్మృతిలో స్త్రీలకు సంబంధించిన కొన్ని సూత్రములు ఈక్రింద ఇవ్వబడుతున్నవి. „భార్య, కుమారుడు, బానిస ఈముగ్గురకు స్వంతఆస్తి ఉండగూడదు. వారు ఏమి సంపాదించినప్పటికి అది, వారెవరి స్వాధీనంలో ఉన్నారో వారి ఆస్తిఅవుతుంది.” „కన్యగా ఉన్నప్పుడు తండ్రి, యువతిగా ఉన్నప్పుడు భర్త, „ముసలిగా ఉన్నప్పుడు కుమారుడు స్త్రీని కాపాడుతారు” „స్త్రీ మనస్సును అదుపు ఆజ్ఞల్లో ఉంచడం అసంభవమనీ, ఆమె చంచల స్వభావం గలదనీ ఇంద్రుడు ప్రకటించాడు.” „ నిద్ర, అలంకరణ, కోరిక, కోపం, మోసం, చెడు ప్రవర్తన మొదలైనవి స్త్రీ లక్షణాలని ఈశ్వరుడు నిర్ణయించాడు.”

మనువు బానిస సమాజానికి సూత్రకారుడు యూరపు ఇతరదేశములలో బానిససమాజములోవలెనే, స్త్రీలు ఈదేశంలోగూడ పురుషుని నిరంకుశత్వాక్రింద అణగి యుండేవారు. తరువాత వచ్చిన జమీందారీ సమాజంలోగూడ వీరిస్థితి ఏమీ

బాగుపడకపోవటమేగాక ఇంకహీనస్థితికి వచ్చింది. సహగమనం, బాల్యవివాహాలు; వితంతు వివాహాలు, విడాకులు లేకుండుట మొదలైన బానిససమాజంలోలేని దురాచారాలు, అదనంగా వచ్చాయి మనుస్మృతిలో పై జెప్పబడిన దురాచారాలకు తావు లేదు. విడాకులకు పునర్వివాహాలకు అవకాశంగూడ ఉండేది.

## పెట్టుబడిదారివర్గం పుట్టుక

బ్రిటీషువారు మనదేశాన్ని ఆక్రమించడం మొదలుపెట్ట డంతో, జమీందారి సమాజపుపద్ధతిలోఉన్న మనదేశానికి పాశ్చాత్యుల పెట్టుబడిదారి నాగరికతతో సంబంధమేర్పడింది. యంత్రాలమీద తయారుచేయబడిన పారిశ్రామిక వస్తువులతో పోటీకి ఆగలేక, మనదేశంలోని చేతిపరిశ్రమలు- నాశనంగా మొదలిడినవి. వ్యాపారంకొరకు, దేశాన్ని అణచిఉంచడం కొరకు రైళ్ళువేయబడినవి. అక్కడక్కడ జాతీయ పెట్టుబడి దారులచే నడుపబడు చిన్నచిన్న యంత్రాగారాలుగూడ ప్రారంభమయినవి. ప్రభుత్వాన్ని సాగించడానికి ఉద్యోగులను తర్ఫీదు చేయడానికి ఇంగ్లీషుస్కూళ్ళు కాలేజీలుగూడ పెట్టబడి నయి అప్పుడు భారతదేశాన్ని వివిధ స్వదేశరాజులు ఏలు తుండేవారు. వారినుండి దేశాన్ని లాక్కోడానికి, అప్పు డప్పుడే అభివృద్ధి అవుతున్న దేశీయ పెట్టుబడిదార్లను ఇంగ్లీషుచదువు కున్న విద్యాధికులను ప్రభుత్వంచేతిక్రిందకు తీసుకుంది. అందు వలననే ఆరోజుల్లో సంఘసంస్కరణవాదులు ప్రభుత్వానికి వ్యతి రేకంగా ఒక్కమాటగూడ అనేవారుగాదు. రాజకీయాలతో సంబంధముండేదిగాదు. బ్రిటిషుప్రభుత్వ సహాయంతో హిందూ

మతంలోఉన్న దురాచారాలనన్నింటినీ పోగొట్టగలమని నమ్మే వారు! పైగా వీరంతా ప్రభుత్వోద్యోగులే! అంతమాత్రాన వీరిని మనం తృణీకరించరాదు. ఆరోజుల్లో వీరుచేసినత్యాగం వలననే, నేడు మనస్త్రీలు ఈ స్థితిలో ఉన్నారు.

## రాజారామ మోహనరాయి, బ్రహ్మసమాజము

రాజారామ మోహనరాయి బెంగాలు రాష్ట్రంలో రత్నసరం అనే గ్రామంలో 1774 లో పుట్టాడు. ఇతడు చిన్నతనమందే హిందూమత గ్రంథాలను చదివి, హిందూమతంలో ఉన్న దురాచారాలకు విగ్రహపూజకు బద్ధవిరోధి అయ్యాడు. విగ్రారాధన కూడదనీ, సత్యాన్ని అనుసరించడమే మానవుని ధర్మమనీ బోధించాడు. 16 సం॥ వయస్సప్పుడే ఇంట్లోనుండి వెళ్ళగొట్టబడ్డాడు తరువాత 4 సం॥కు తిరిగి తీసుకురాబడ్డాడు. కాని చుట్టుపట్లఉన్న సనాతనులు వీరి ఇంటిముందు కాకులవలె కూయడం, ఎముకలు పారవేయడం మొదలైనవి చేస్తూఉండే వారు. సనాతనుల దౌర్జన్యానికి ఆగలేక రామమోహనరాయల తండ్రి కుమారుని మరల ఇంటినుండి వెడలగొట్టాడు. రామ మోహనరాయలు ఇంగ్లీషు విద్యనభ్యసించి, ప్రభుత్వ ఉద్యోగంలోచేరి, శిరస్తాదారు అయి చాలడబ్బు అనుభవాన్ని సంపాదించాడు. ఈ డబ్బుతో ఈయన ఒకజమీనునుకొని, అక్కడ తనభావాలను ఆచరణలో పెట్టమొదలు పెట్టెను. తరువాత కలకత్తాలో 1829 లో బ్రహ్మసమాజ మందిరాన్ని స్థాపించాడు. ఈ బ్రహ్మసమాజమతం బెంగాలుఅంతా వ్యాపించెను. సాంఘికంగా ఈ బ్రహ్మసమాజమతం చాల ముందుకు

పోయింది. స్త్రీవిద్య, సహగమన దురాచార నిర్మూలనం మొదలగువానిలో తీవ్రకృషి చేసేది.

ఒకనాడు రామమోహనరాయి సగం శరీరం కాలిన స్త్రీ భర్త చితినుండి దూకిరావడం, చుట్టుపట్ల ఉన్నవారు ఈమెను తీసుకువెళ్లి మరల చితిమీద పడవేసి తగులబెట్టడం చూచాడట. నాటినుండి ఈ ఈ దురాచారాన్ని రూపుమాప సమకట్టాడు. ఈదురాచారం హిందూధర్మశాస్త్రదృష్టితో జూచినా సమర్థనీయంగాదు. భర్తవియోగదుఃఖములో ఉన్నప్పుడుభంగు అనేమత్తుపదార్థంఇచ్చి సహగమనానికిస్త్రీయొక్క అంగీకారాన్ని నామమాత్రంగా పొందేవారు. భర్త చితిమీద కూర్చొబెట్టి ఆమె వడలు కాలినప్పుడు లేవడానికి వీలులేనన్ని కట్టెలు ఆమెమీద పడవేశేవారు. ఆబాధకు తాళజాలక లేస్తుంటే వాసాలతో ఆమెను చితిలో పడగొట్టి దహనం చేసేవారట! ఈ విషయాలన్నీ ఈయన పత్రికాముఖాన ప్రచురించాడు. అప్పుడు గవర్నరు జనరలుగాఉన్న బెంటిన్కు ప్రభువు రామమోహనరాయలను పిలిచి సంప్రదించెను. తత్ఫలితంగా 1829 లో సహగమన నిరోధచట్టాన్ని ప్రభుత్వం ప్యాసుచేసెను.

తరువాత బహు భార్యత్వాన్ని ఆపడానికి వితంతువులకు గూడ కుమారులతో పాటు భర్త ఆస్తిలో భాగం పంచుకునే హక్కును ప్రసాదించమని ప్రభుత్వాన్ని కోరాడు. కాని ప్రభుత్వం ఇందుకు అంగీకరించలేదు. ఈ విధంగా సంఘసంస్కరణ కోసం పాటు బడుతున్న ఈయనను హత్యచెయ్యాలని సనాతనులు ప్రయత్నిస్తుండేవారట! ఈయన ఎప్పుడు స్వరక్షణార్థం

బాకు ఉంచుకునేవాడట. తరువాత ఈయన ఏదో ఒక కేసు సందర్భంలో ఇంగ్లండుపోయి బ్రిస్టల్ అనే నగరంలో 1833 లో చనిపోయాడు. అయన సమాధి ఇప్పటికీ అక్కడ ఉంది.

## ఈశ్వరచంద్రి విద్యాసాగర్

తరువాత బ్రహ్మసమాజంలో సాంఘిక సంస్కరణ విషయాలల్లో పేరుబడసినవాడు. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ ఈయన 1820 లో బెంగాలులోని మిడ్నపూరు జిల్లాలో జన్మించాడు. ఈయనగూడ రామమోహనరాయివలెనే హిందూ మతంలోని దురాచారాల నుద్వేషించుతూ బ్రహ్మ సమాజ మతంచేత ఆకర్షింపబడెను. ఈయన మొదట కలకత్తాలో ఒక కళాశాలలో సంస్కృత ఉపాధ్యాయుడుగా ఉండేవాడు. తరువాత ప్రభుత్వ సహాయంతో బెంగాలులో అనేక గ్రామాల్లో స్కూళ్ళను పెట్టెను. ఈయన ఆందోళణ ఫలితంగానే 1849 లో స్త్రీలు ఉన్నతవిద్య అభ్యసించడానికి, బెథూన్ కళాశాల స్థాపింపబడెను.

ఆ సంవత్సరంలోనే బొంబాయిలో ఎల్ఫిన్‌స్టన్ కాలేజీ విద్యార్థులు ఆడపిల్లలకు ఒక స్కూలు పెట్టారు. వయస్సు వచ్చిన స్త్రీలకు "పాతాచారాలను పెంటపోగులో పారవేయి" (Hang it all) అనేపేరుగల పత్రికనుగూడ నడిపారు.

బ్రిటిషు ప్రభుత్వం హిందూదేశంలో స్థాపింపబడటానికి పూర్వం బ్రాహ్మణులచేత స్కూళ్ళు నడుపబడేవి. ఇందులో లోకోపకారమైన విద్యకు ప్రాధాన్యత ఉండేదిగాదు. మత విద్యయే ఎక్కువగా చెప్పబడేది. ఈస్కూళ్ళలో బాలబాలికలు

కలిసి విద్య నభ్యసించేవారు. బ్రిటిషు ప్రభుత్వ స్థాపనతో క్రమ క్రమంగా ఈస్కూళ్ళు అంతరించ మొదలుపెట్టాయి. బాలికలు ఈస్కూళ్ళలోకి రావడం కూడా మానివేశారు. ప్రభుత్వం గ్రామాల్లో బాలురకు ప్రాథమిక పాఠశాలలు స్థాపించ మొదలుపెట్టింది. కాని ఈ స్కూళ్ళలోకి బాలికలు రాకుండ నిషేధింపబడింది. కాని విద్యాసాగర్ సాగించిన ప్రచార ఫలితంగా, 1854 లో ఈనిషేధం తొలగింపబడింది. ఈరోజుల్లో బ్రహ్మసమాజంతోపాటు ఆర్యసమాజం క్రిష్టియను మిషనరీలు స్త్రీ విద్యకోసం పాటుబడ్డారు.

1829 లో రామమోహనరాయి కృషివలన వితంతువులు చితినుండి రక్షింపబడ్డారు. కాని సంఘంలో వారు హీనంగా చూడబడటం, ఇంట్లో బానిసవలెచూడ బడటంతో వితంతువులకు ఈలోకం భూలోకనరకంగా ఉండేది. తిరిగి విద్యాసాగర్ 1855లో వితంతువివాహాల విషయం లేవదీసేవరకూ, వారి విషయం తలచినవారులేరు. వితంతు వివాహాలకు చట్టసంబంధమైన నిరోధం తొలగించవలసిందని 1000 దస్కతులతో ప్రభుత్వానికి ఒక మహజరు విద్యాసాగర్ పంపించాడు. తరువాత దీనికి వ్యతిరేకంగా సనాతనులు 60,000 దస్కతులుగల ఒక మహజరును సంస్కరణ వాదులు 30,000 దస్కతులుగల మరొక మహజరును పంపారు. ఎలాగైతేనేం 1855లో విద్యాసాగరు సూచన నంగీకరించి, ఒక చట్టాన్ని చేసింది. ప్రభుత్వం చట్టం ప్యాసుచేసిందిగాని, పల్లెల్లో అమలు జరిపే బాధ్యత సంస్కరణవాదులమీద ఉంది. వారు ఎన్నో అవస్థలు పడి అక్కడక్కడ కొన్నివివాహాలు చేశారుగాని ఈ

సమస్యను పరిష్కరించలేకపోయారు. జమీందారి సమాజం పూర్తిగానాశనం గావింపబడనిదే ఈసమస్య పూర్తిగా పరిష్కరింప వీలులేదు.

తరువాత విద్యాసాగర్ బెంగాలులో కులీన బ్రాహ్మల్లో 50, 60 మంది స్త్రీలను ఒకడు పెండ్లిచేసుకునే ఆ చారానికి వ్యతిరేకంగా ఆందోళన ప్రారంభించాడు. 25 వేల దస్కతులు గల మహజరు ద్వారా ఈదురాచారాన్ని నిషేధించమని ప్రభుత్వానికిపంపాడు. కాని ప్రభుత్వం ఇంతపని చెయ్యడానికి జంకింది.

సంఘసంస్కరణ సాగించుటవల్ల ఈయన సనాతనులకు కంటకం అయాడు వారు ఈయననుచంపడానికికూడా యత్నించారు. ఒకసారి ఒక ధనికుడు ఇతనిని చంపడానికి కొంతమంది కౌడీలను దారిలో కాపలావుంచాడు. ఈవిషయం ఇతడు తెలుసుకొని, సరాసరి ఆధనికునివద్దకువెళ్ళి తనఅభీష్టాన్ని నెరవేర్చమని అడిగాడు.అతడు సిగ్గుపడి తనప్రయత్నాన్ని విరమించుకొన్నాడు.

## ప్రథమభారత స్వాతంత్ర్యయుద్ధం : ప్రభుత్వపు వైఖరిమార్పు.

బ్రిటీషు పరిపాలనక్రిందఉన్న ప్రాంతాల్లో అంతులేని దోపిడీవిధానంవల్ల, ఇంతకు పూర్వమున్న 'ఇర్రిగేషన్‌వర్క్స్' చేతిపరిశ్రమలు నాశనమవుటవల్ల పెద్దక్షామాలు వచ్చాయి. దీనికి జాతీయవిద్వేషం సహాయంచేసింది. స్వదేశరాజులు ఈ అసంతృప్తిని ఉపయోగించుకొని, బ్రిటీషువారిని ఈ దేశంనుండి సాగనంపి తమ పెత్తనాన్ని తిరిగి స్థాపించుకోవడానికి ప్రయత్నంచేశారు. హిందూమహమ్మదీయ రాజులు ప్రజలు అంతా ఏక

మయ్యారు. 1857 వేసవిలో విప్లవం ప్రారంభమయింది. సిపాయీలలో అత్యధికసంఖ్యాకులు విప్లవంలో మిళితమైపోయారు. ఉత్తరహిందూస్తానమంతా 2 సం॥ భారతీయులచేతుల్లోఉంది. ఇంతలో జమీందారీతత్వంలో అంతర్భూతమైఉన్న సహజమైన అనైక్యతపైకివచ్చింది. ఢిల్లీసింహాసనంమీద హిందువులు కూర్చోవాలా? లేక మహమ్మదీయుడు కూర్చోవాలా అనే మీమాంస బయలుదేరింది, ప్రజలు రాజులతోనూ బ్రిటీషు ప్రభుత్వం తోనూ విసుగెత్తి ఉన్నారు. ప్రజలు తమను గూడ తోసివేసి, ముందుకు పోతారేమోననేభయం రాజులకు పుట్టింది. హిందూదేశ పారిశ్రామికాభివృద్ధిని కోరుతున్న పెట్టుబడిదారులతోను మేధావులతోను ఇంక తమకు సఖ్యత కుదురదనీ దేశాభివృద్ధికోరని జమీందారీముఠాయే తనకుఅండగా ఉండగలదనీ గ్రహించారు. జమీందారిముఠా బ్రిటిషు పెట్టుబడిదార్లు కలిసారు. విప్లవం భగ్నమయింది. యీస్టిండియా కంపెనీచేతుల్లోనుండి పరిపాలనను బ్రిటిషుప్రభుత్వం పూర్తిగా తనచేతుల్లోకి తీసుకుంది. దీనితో భారతచరిత్రలో నూతన అధ్యాయం ప్రారంభమయింది. ఇంతకుపూర్వం సాంఘిక సంస్కరణలకు ప్రోత్సాహమిచ్చుచున్న పభుత్వం ఇప్పుడు క్రమక్రమంగా మానడం మొదలుపెట్టుట అప్పటి సాంఘిక సంస్కరణవాదుల పని మరీకష్టమైంది.

## కందుకూరి వీరేశలింగం : పెట్టుబడిదారి నాగరికతకునాంది.

రామమోహనరాయి, విద్యాసాగరుల సంస్కరణోద్యమం, ఆంధ్రదేశంలో వీరేశలింగంగారిద్వారా తలఎత్తింది.

సంస్కరణవాదదృష్టిలో, ఈయనపై ఇద్దరికన్న ఇంకాతీవ్రంగా పనిచేశాడని చెప్పవచ్చును. ఆంధ్రదేశంలో ప్రాత ఆచారాలను విమర్శించుతూ, రేషనలిజం (వివేకంతో పరిశీలించుట) ఆంధ్ర దేశంలో ప్రథమంగా ప్రవేశపెట్టినది. ఈయనయే. ఈయన సమకాలికులు కొమర్రాజులక్ష్మణరావు చిలుకూరి వీరభద్రరావు మొదలైనవారు యీ దృక్పథంలో పనిచేశారు. వీరిరచనలు విజ్ఞానచంద్రికా గ్రంథమండలి ప్రచురణలు ఆంధ్రదేశంలో పెట్టుబడిదారి నాగరికతకునాందియేకాని ఇదిఆంధ్రదేశంలో అభి వృద్ధిగాలేదు. వీరితోనే అంతమయింది. కమ్యూనిస్టుపార్టీయే ఈ సాహిత్య సంస్కరణరంగాల్లో భారాన్నంతా మోయవలసిన అవసరం పట్టింది.

వీరేశలింగంగారు 1848 ఏప్రిల్ 16 వ తేదీన రాజ మండ్రిలో జన్మించారు. వీరు ఇంగ్లీషు విద్యకొంతవరకూ అభ్య సించి రాజమండ్రిలోని గవర్నమెంటు కాలేజీలో 1871 లో రు 25 జీతంమీద ఉపాధ్యాయుడుగా కుదిరాడు. తరువాత అక్కడక్కడ పాఠశాలల్లో గూడ ఉపాధ్యాయుడుగా పని చేశాడు. చివరకు మద్రాసు ప్రసిడెన్సీ కళాశాలలోగూడ పని చేశాడు. 1919 లో రాజమండ్రిలో చనిపోయాడు.

ఈరోజుల్లో సనాతనులకు తూర్పు గోదావరి జిల్లాలో నాయకుడుగాఉన్న కొక్కొండ వెంకటరత్నంపంతులు స్త్రీ విద్యకు వ్యతిరేకంగా వ్యాసాలు వ్రాశాడట! వాటిని విమర్శిం చుతూ వ్యాసాలు వ్రాసి ఈయన సంఘుసంస్కరణ రంగంలో ప్రవేశించాడు. తరువాత ఈయన "వివేకవర్ధని" అనే వార

పత్రిక పెట్టి అందులో మూఢాచారాలను మూఢనమ్మకాలను తీవ్రంగా విమర్శించుతూ కథలు వ్రాసేవాడు. దీని కనుబంధంగా హాస్యరస సంజీవని అనే మాసపత్రికను గూడ ప్రకటించాడు. వీనిలో సాంఘికదురాచారాలు మూఢనమ్మకాలతో బాటు, ఉద్యోగుల లంచగొండితనాన్ని గూడ విమర్శించేవాడు. ఒకసారి రాజమండ్రికోర్టు మునసబు లంచంతీసుకొని ఒక మహమ్మదీయుని కేసు కొట్టివేయగా అతను మొదటవ్రాసిన జడ్జిమెంటు కాగితపు ముక్కలను పాకీడబ్బానుంచి తీయించి దాచి వివేకవర్ధనిలో ఈ విషయాన్ని గురించి గట్టిగా విమర్శించాడు. ఈయనమీద కేసు రాగా ఆ కాగితపు ముక్కలనుచూపి తప్పించుకున్నాడు.

ఈవిధంగానే పోలీసులు ఒకసారి ఒకయువతిని పరాభవం చేయబోగా ఆ దారినబోయే ఒకపురుషుడుచూచి ఆమెను రక్షించి ఈవిషయం వీరేశలింగంగారితో చెప్పెను. ఈయన ఆవిషయాన్ని వివేకవర్ధనిలో ప్రకటించెను. అందుకు ఈయనమీద అరెస్టువారంటు పుట్టి కేసు పెట్టబడెను. సాక్ష్యానికి ఎవ్వరూరావడానికి సాహసించలేదు. ఎలాగో యీ కేసునుండి తప్పించుకొన్నాడు.

ఈయన కార్యవాదిగూడ. ఈయనదగ్గర చదువుకుంటున్న బాలురద్వారా ఒక బాలికాపాఠశాల పెట్టించాడు. దీనిని పోగొట్టడానికి సనాతనులు ఎన్నో ప్రయత్నాలు చేశారు. వితంతువులను చాటుగా రక్షించి తీసుకువచ్చి వివాహాలు చేసేవాడు. ఈ పునర్వివాహ దంపతులను ఆదర్శప్రాయంగా

ఉండటానికి రాజమండ్రి బజారులో ఊరేగింపులు జరిపేవాడు. ఈయనకు సిబ్బంది విద్యార్థులే. ఇందువల్ల ఎన్నో కేసులకు గురి అయ్యాడు. అయినా ఈయన జంకక తన కర్తవ్యాన్ని నెరవేర్చేవాడు.

శంకరస్వాములవారి వ్యక్తిగత చరిత్రను, ఆయన మోసాన్ని గురించి కూడ వివేకవర్ధనిలో ప్రచురించాడు. 1881లో శంకరస్వాములవారు వీరేశలింగంగారిని అనుచరులను వెలివేయుటానికి రాజమండ్రి వచ్చాడు. స్వాములవారి శిష్యులు గోదావరిఒడ్డున కొంతమంది విద్యార్థులను కొట్టారు. అప్పుడు విద్యార్థులు వెళ్లి ఆస్వాములవారి శిష్యులను చావ చితకగొట్టి స్వాములవారి బసముందు అల్లరి ప్రారంభించారు. దానితో స్వాములవారు భయపడి పారిపోయాడు.

1878 లో ఈయన విగ్రహారాధనకు వ్యతిరేకంగా ప్రార్థనా సమాజాన్ని స్థాపించాడు. ఈయన బ్రహ్మసమాజంలో గూడ చేరాడు. ఆంధ్రదేశంలో బ్రహ్మసమాజానికి పునాది తూర్పుగోదావరిజిల్లా. పిఠాపురం జమీందారుగూడ ఈ సమాజంలోచేరికాకినాడలో ఒక కళాశాలగూడ ప్రారంభించాడు. ఈ ఉద్యమంలో ముఖ్యుడు రఘుపతి వెంకటరత్నం నాయుడు. ఆంధ్రలో బ్రహ్మసమాజం స్త్రీవిద్యకోసం చాల కృషిచేసింది.

వీరేశలింగం ప్రభృతులు సమాజంలోని దురాచారాలకు మూలం జమీందారీ ఆర్థిక విధానమనీ దేశస్వాతంత్ర్యాన్ని సంపాదించి దీన్ని పోగొట్టి పెట్టుబడిదారి విధానం తీసుకువస్తేనే గాని ఇవి పోదని గ్రహించలేదు. కనుకనే వీరిశక్తినంతావితంతు

వివాహాలు చేయడంలోనే ఖర్చుపెట్టారు. బ్రిటిషు ప్రభుత్వ ములా దేశాన్ని దోపిడీ చేస్తూఉండగానే, ఈ దురాచారాలను మాన్పగలమని నమ్మారు. ఈయనవితంతు శరణాలయాన్ని స్థాపించాడు. అది ఇప్పటివరకూ సాగుతూనే ఉంది. ఈయన ప్రతికక్షులు, ఈయన సహచరులలో ఒక్కరైన నాళం కృష్ణా రావుఈయనమీద వ్యభిచారపు కేసుగూడ పెట్టించారు. దాని లోనుండి ఎలాగో బయటపడ్డాడు. చివరకు 1919 లో రాజ మండ్రిలో చనిపోయాడు.

తన అపూర్వత్యాగంవల్ల ఆంధ్ర స్త్రీలోకాన్ని తరత రాలనిద్రనుండి మేల్కొలిపిన యీాయన ఆంధ్రస్త్రీలకు చిర స్మరణీయుడు.

సాంఘిక సంస్కరణ వాదులు : వృత్తి స్కూళ్ళు

ప్రభుత్వం సంస్కరణ వాదులకు సహాయం పూర్తిగా మానివేసింది. 1855 నుండి 1930 వరకూ ప్రభుత్వం సాంఘిక సంస్కరణకు సంబంధించిన చట్టము ఒక్కటితప్ప మరేమీ చేయలేదు. వీరి ఆందోళనవల్ల బాల్యవివాహాలు నిషేధించుచూ పురుషులు 18 సం॥ స్త్రీలు 14 సం॥ వయస్సు వచ్చేవరకూ పెండ్లి చేసుకోగూడదని శాసించింది. కాని సనాతనుల వత్తిడి వల్ల ఆశాసనాన్ని తిరిగి ఉపసంహరించుకొంది. సంస్కరణ వాదులు దేశపరిస్థితులకు, ప్రభుత్వానికి కూడ ఎదురీద వలసి వచ్చింది. మలబారీ, గోవిందరనడే, తెలంగు అను పెద్ద ప్రభు త్వోద్యోగులు ఈ సంస్కరణోద్యమానికి సహాయం చేస్తూ ఉండేవారు. ఆ రోజులలో సాంఘిక సంస్కరణకు పాటుబడే

స్త్రీలు గోవిందరానడే భార్యఅయిన రామాబాయిరానడే సంస్కృతవిద్యలో గొప్పపాండిత్యాన్ని గడించిన పండిత రామాబాయి, ఫ్రాన్సినాసోరబజీ, 1881లో భారతదేశం మొత్తంమీద 1,80,00,000 వితంతువులున్నారని అంచనావేశారు. ప్రభుత్వం ప్యాసుచేసినచట్టాలు ప్రజలలో అమలు జరుగుటలేదు. దీన్ని గ్రహించి సంస్కరణవాదులు ప్రజలలో ప్రచారంచేసి వారిని ఒప్పించవలసినఅవుసరాన్ని గూడగ్రహించారు. అంతేగాక స్త్రీలు స్వతంత్రులుగా ఉండాలన్నా, వితంతువులు వివాహాలు చేసుకోవాలన్నా, స్వేచ్ఛాజీవనం నేర్చుకోవాలని వీరు ఊహించారు. అందువల్లవీరు అప్పటినుండి వృత్తిపాఠశాలలు, వితంతు శరణాలయాలు పెట్టడంమొదలుపెట్టారు.వితంతుసమస్యను పరిష్కరించడానికిపూనుకోవడం ఇదిమొదటిసారి. మొదట ఫ్రాన్సినాసోరబ్ జీ పూనాలో స్త్రీలకు వృత్తిస్కూలుపెట్టింది. సంస్కృతవిద్యలో పాండిత్యాన్నిగడించి స్త్రీవిద్యమొదలగు విషయాలలో శాస్త్రాధారంతోనే సనాతనపండితులను జడిపించుతూ భారతదేశంలో సంచారంచేస్తూ పండిత రామాబాయి అనే బంగాలీ వితంతువు పూనావచ్చింది. సోరబ్ జి స్థాపించిన పాఠశాలనుచూచి ఆచరణలేని ప్రచారం లాభంలేదని గ్రహించి ఆ స్కూలులోచేరి తర్ఫీదు పొంది, తానొకస్కూలుపెట్టి మహిళాసేవలోనే జీవితాన్నంతా గడిపింది.

రామాబాయి రనడే గూడ పూనాలో పారిశ్రామిక వృత్తుల నేర్పేస్కూలుపెట్టింది. ఈ విధంగాదేశమంతటా బ్రహ్మసమాజము, ఆర్యసమాజము, క్రైస్తయను మిషనరీలు స్త్రీల స్కూళ్ళుపెట్టి మహిళాభ్యుదయానికెంతో తోడ్పడ్డారు.

ఈ రోజులలో స్త్రీ సాంఘికాచారాల్ని ధిక్కరించ డానికి సమాజమేగాక ప్రభుత్వంగూడ ఎలా ఆటంకాలుపెట్టేదో ఈచిన్నఘటనవల్ల తెలుస్తుంది. దుర్గాబాయి అనే మహారాష్ట్రి యువతికి చిన్నప్పుడే పెండ్లిఅయింది. ఆమెకు చదువుయందు చాల అభిలాషఉంది. ఆమె యౌవనంరాగానే భర్తతీసుకు వెళ్ళడానికి ప్రయత్నించాడు. ఆమె చదువుకొంటాననీ తనకు సంసారంచేయడం ఇష్టంలేదనిచెప్పింది. అతడుకోర్టులో దావా వెయ్యగా ఆకుమె శిక్షవేయబడింది. ఆమె శిక్ష ననుభవించి, తర్వాత ఇంగ్లండువెళ్ళి డాక్టరు పరీక్ష చదివింది.

ఎన్నివితంతు శరణాలయాలు పెట్టినా సమస్య పరి ష్కారంగాలేదు. మల్బారీ 1891 లో ఈసమస్యను గూర్చి ఒక విన్నపన్ని పంపాడు దానిలో ఈ సమస్యా పరిష్కారానికి ఈ క్రింది సూచనలుచేసాడు. (1) వితంతువుతన ఇష్టానికి వ్యతి రేకంగా వితంతువుగా ఉంచబడరాదు. (2) అలా అనుమాన మున్నచోట్ల ప్రభుత్వం చర్యతీసుకోవాలి (3) అట్టి వితంతు వులు ప్రభుత్వంతో మనవిచేసుకోవడానికి ఉచితన్యాయవాది సౌకర్యం ఉండాలి. స్టాంపుకర్చులు ఉండగూడదు కోర్టుకు హాజరుకానవుసరంలేదు. (4) వితంతు వివాహాలను చేసుకున్న కుటుంబాలను వెలివేయడానికి బ్రాహ్మలకు హక్కుఉండరాదు.

ఈ సూచనలను ప్రభుత్వం అంగీకరించలేదు.

# కాంగ్రెసు పుట్టుక
# స్త్రీల రాజకీయ హక్కులకై ఆందోళణ

అప్పుడప్పుడే అభివృద్ధి అవుతున్న పెట్టుబడి దారి వర్గం విద్యాధికులు అక్కడక్కడ సంఘాలను పెట్టుకుంటున్నారు. కాని వీరందరికీ అఖిల భారతవేదిక లేదు. 1885 ప్రాంతంలో వచ్చిన క్షామంతో దేశంలో మరల అరాజకం తిరుగుబాట్లు వచ్చేలాగున కన్పించాయి. ప్రజలనుండి విద్యాధికులను వేరు చేయడానికి ప్రభుత్వంవారికి తమకోర్కెలను తెలియ బరిచే సంఘం ఏర్పరచడానికి సమకట్టింది. ఈ విధంగా 1884 లో ప్రభుత్వసహాయంతో జాతీయకాంగ్రెసు పుట్టింది. కాని సాంఘిక సమస్యలలో సంస్కరణవాదులు ఏ పిటీషనింగు పద్ధతిని అవలంబించేవారో, రాజకీయరంగంలో ఉన్నతోద్యోగాలు భారతీయులకు ఇవ్వాలనీ, ఎన్నికద్వారా వచ్చినకొంతమంది భారతీయులను, నామినేటు చేయబడినవారిని కొంతమందిని కలిపి శాసన సభలు ఏర్పరచమనీ ప్రభుత్వానికి ఈ జాతీయ కాంగ్రెసు పిటీషన్లుపెట్టేది. అందువల్ల సాంఘిక సంస్కరణరంగంలో జాతీయకాంగ్రెసు పుట్టుకవల్ల పద్ధతులలో మార్పుకలుగలేదు. మొదట కాంగ్రెసు పెట్టుబడిదార్ల మధ్యతరగతివారి కోర్కెలను తెలిపే ప్రబలమైన సంస్థగా తయారవడంతో, ప్రభుత్వం కాంగ్రెసుయెడల అసూయగూడ చూపడం మొదలుపెట్టింది. కాంగ్రెసుయొక్క పిటీషనింగు పద్ధతికి ప్రభుత్వం ఏమీ చెవి యొగ్గలేదు. అందువలన కాంగ్రెసుతో పోరాడి హక్కులను

సంపాదించాలనే అతివాదముగా, తిలకునాయకత్వంక్రింద బయలు దేరింది. అతివాద ఉద్యమంబలంగాఉన్న బెంగాలులో హిందూ మహమ్మదీయులమధ్య తగాదాలు పెట్టడానికి, 1907 లో కర్జన్ ప్రభువు రాజప్రతినిధిగాఉన్న కాలంలో, బెంగాలును రెండుగా ప్రభుత్వం చీల్చింది. ప్రభుత్వం అభీష్టం నెరవేరక పోవుటయేగాక ఇది బెంగాలులో జాతీయోద్యమం విప్లవ పంథాన పోవుటకు కారణమయింది. ఈ సమస్య యావద్భారత దేశాన్నంతనీ కదల్చి వేసించిది కాంగ్రెసు విదేశవస్తు బహిష్కారోద్యమం ప్రారంభించింది. ప్రభుత్వం లొంగి బెంగాలును తిరిగి 1911 లో ఐక్యపరచక తప్పిందిగాదు. రాజకీయహక్కులు ఆదర్శంగా ఉన్న జాతీయోద్యమ ప్రభావం మహిళలమీద గూడ పడింది. అందులోను విదేశవస్తు బహిష్కారోద్యమం మహిళాలోకాన్ని కదిపివైచింది. ఇంతవరకూ సాంఘిక సంస్కరణమీద నున్నవారిదృష్టి, స్త్రీల రాజకీయ హక్కులవైపు గూడమళ్ళింది. 1912 ప్రాంతాల్లో వచ్చిన మింటోమార్లే సంస్కరణల ప్రకారం, ప్రజలచే ఎన్నుకోబడిన ప్రతినిధులు కొందరు శాసన సభలలోకి తీసుకోబడ్డారు. కాని వీనిలో స్త్రీలకు ప్రాతినిధ్యంలేదు. అందువల్లఅప్పుడప్పుడే రాజకీయచైతన్యం పొందుచున్న స్త్రీలోకంలో, ఓటింగుహక్కుకోసం ఆందోళన బయలు దేరింది.

ఇంతలో మొదటి ప్రపంచసంగ్రామం ఆరంభమయింది. యుద్ధంవల్ల భారతదేశంలో బయలుదేరిన ఆర్థికసంక్షోభంవల్ల మరల తిరుగుబాట్లు వచ్చేసూచనలు కనబడినవి. 1916 లో సింగపూరు మొదలైనచోట్ల టెర్రరిస్టుల నాయకత్వంక్రింద

సైన్యాల్లో తిరుగుబాటుకూడ వచ్చింది. ఈ సమయంలో అని బీసెంటుఅనే ఆమె హోమ్‌రూల్ లీగును, స్థాపించి, ప్రజల్లో వచ్చిన ఈ అసంతృప్తిని ఒకమార్గాన నడిపించడానికి ప్రయత్నించింది. ఈ మెఒకక్రైస్తవ మతాధికారిభార్య. ఈమె 1893 లో భారతదేశం వచ్చింది. అప్పటినుండి ఈమె స్త్రీల ఔన్నత్యం కోసం పాటుబడింది. దివ్యజ్ఞాన సమాజం (ఈసమాజంవారు మనుష్యుని పూర్వజన్మనుగూర్చి తెలుసుకోగలమని చెబుతారు) Theosophical society స్థాపకురాలయింది. ఈ సమాజంవారుగూడ స్త్రీ విద్య అంతర్వర్ణ వివాహాలు, వితంతు వివాహాలు మొదలైనవి ప్రోత్సహిస్తారు. అనిబీసెంటు మద్రాసులో అడయారు అనేచోట ఒకస్కూలును స్థాపించింది. అనిబిసెంటుచే ఆరంభింప బడిన హోమురూలు ఉద్యమప్రభావం చదువుకున్న స్త్రీలమీదగూడ పడింది. అనిబిసెంటు నాయకత్వంక్రింద భారతమహిళాసంఘం (Womens indian association) 1917 లో స్థాపింపబడెను. 20 1930 మధ్య వివిధ పట్టణాలలో 87 బ్రాంచి సంఘాలు ఏర్పరుపబడెను. ఈ సంఘాల్లో చదువుకున్నస్త్రీలు ఉండేవారు. పట్టణకార్మికుల స్త్రీలలోకిగాని, పల్లెగ్రామాల రైతులస్త్రీలలోకిగాని మహిళా ఉద్యమం చొరబడలేదు. 1917 లో ప్రభుత్వం భారతదేశాన్ని అధినివేశస్వాతంత్ర్యంవైపు తీసుకువెళ్ళడమే తమలక్ష్యమని ప్రకటించారు. పరిస్థితులను తెలుసుకోవడంకోసం అప్పుడు ఇండియా మంత్రిగాఉన్న మాంటాగ్యూ 1917 లో ఇండియాకువచ్చాడు. స్త్రీల రాజకీయ హక్కులను ఇతర కోరికలను తెలుపుటకై భారతదేశం అన్నిమూలలఉన్న మహిళాసంఘాల ప్రతినిధు

లైన 14 మంది స్త్రీలు సరోజనీదేవి నాయకత్వంక్రింద మద్రాసులో మాంటాగ్యూనుకలుసుకున్నారు. ముఖతా వారికోర్కెల యెడల ఇండియామంత్రి సానుభూతిని చూపినప్పటికీ, సంస్కరణల రిపోర్టులో స్త్రీలనుగూర్చి ఒక్కముక్కగూడ వ్రాయలేదు. తరువాత 1918 లో వోటింగువిషయాలను నిర్ధారణచేయుటకై సౌత్ బరో ఫ్రాన్చైజు కమిటీ ఇండియావచ్చింది. అప్పుడు స్త్రీలు దేశపరిపాలనలో పురుషులతోబాటు తమకుగూడ భాగముండాలని ఆందోళన చేశారు. అన్నిజాతీయసంస్థలు ఈ ఆందోళనను బలపరిచాయి. అయినప్పటికి సనాతనులను జమీందార్లను సంతృప్తిపరచుటకు ప్రభుత్వం అంగీకరించలేదు. సౌత్ బరో కమిటీగూడ ఈ విషయాన్ని గూర్చి నోరు మెదపలేదు. తరువాత 1919లో మాంటాగ్యూచే తయారు చేయబడిన ఇండియాబిల్లు పార్లమెంటులో ప్రవేశ పెట్టబడింది. ప్రభువులసభ, కామన్సుసభలయొక్క జాయంటుకమిటీ సమావేశంముందు, సరోజినీనాయుడు అనిబిసెంటు హీరాబాయి ఆమెకుమార్తె భారతస్త్రీల ప్రతినిధులుగా వెళ్ళి భారతస్త్రీల కోర్కెలను తెలియపరచారు. భారతస్త్రీలు చేసిన యీఆందోళన ఫలితంగా ఆజాయంటు కమిటీస్త్రీల రాజకీయ హక్కుల విషయం భారతశాసనసభలకు వదలివేసింది. మాంటాగ్యూ చెమ్స్ఫర్డు సంస్కరణలు ఇండియాలో అమలు జరపడానికి ప్రభుత్వం ప్రయత్నించింది.

## 1921 సత్యాగ్రహోద్యమం

యుద్ధంవల్ల ఏర్పడిన ఆర్థికసంక్షోభవల్ల ప్రజలు అశాంతిపూరితులై ఉన్నారు. ఆసమయంలో ఈ స్వల్ప సంస్కర

ణాలు వారి నాకర్షించలేదు. పంజాబులో జలియనువాలా బాగు ఘట్టంజరిగింది. దీనితో భారతదేశం అట్టుడికినట్లుడికిపోయింది. కాంగ్రెసు, గాంధీజీ నాయకత్వంక్రింద సత్యాగ్రహోద్యమం ఆరంభమయింది. తరువాత ఉద్యమం గాంధీజీ ఊహించినట్లుగా అహింసఅనే చట్రాన్ని చీల్చుకు బయటబడే సూచనలు గన్పించాయి. బీహారురాష్ట్రంలో చౌరిచౌరాఅనేచోట 20 మంది పోలీసులు పోలీసుస్టేషనులో తగులబెట్టబడ్డారు. దీనితో గాంధీజీ ఉద్యమాన్ని ఆపివేశాడు. గాంధీజీయొక్క ప్రత్యక్షఉద్యమం స్త్రీలనుగూడ ఆకర్షించింది. స్త్రీలుగూడ కొంతమంది సత్యాగ్రహోద్యమంలో జైళ్ళకువెళ్ళారు. మహిళాఉద్యమంలో ఇది ఒక కొత్తఘట్టం జాతీయస్వాతంత్ర్య పోరాటంలో తాముగూడ పాల్గొంటేనేగాని తమకనీసకోర్కెలు నెరవేరవని మధ్యతరగతి స్త్రీలు గ్రహించసాగారు.

తిలకుయొక్క అతివాద ఉద్యమం స్త్రీలనాకర్షించకపోవడానికి గాంధీజీఉద్యమం ఆకర్షించడానికి ఒకకారణముంది. కాంగ్రెసులో మితవాదులు ప్రభుత్వంతో ఎట్టిప్రత్యక్షచర్యకు అంగీకరించేవారుగారు. పిటీషనులతో కాలంగడిపేవారుగాని వీరు సాంఘిక విషయాల్లో అతివాదులుగా ఉండేవారు. పాశ్చాత్య నాగరికత మనదేశంలో ఉన్నదున్నట్లుగా భారతదేశంలోకి దిగుమతి చెయ్యాలని కోరేవారు. తిలకునాయకత్వం క్రిందనున్న అతివాదులు పాశ్చాత్యనాగరికతను అసహ్యముగా చూచేవారు. భారతదేశంయొక్క ప్రతిపురాతన ఆచారాన్ని ఏదోవిధంగా సమర్థించేవారు. అందువల్లవీరు సాంఘిక విష

యాల్లో అభివృద్ధి నిరోధకులుగా ఉండేవారు. కాని రాజకీయంగా చాలఅభివృద్ధి భావాలు కలిగిఉన్నప్పటికీ ఈ జాతివాదులు మహిళాఉద్యమంమీద తమ ప్రభావాన్ని వ్యాపింపజేయలేక పోయారు. కనుకనే మహిళాఉద్యమం 1921 సత్యాగ్రహోద్యమం వరకూ మితవాదుల పలుకుబడిలోనేఉంది. పిటీషనింగు ఎత్తుగడలతోనే నడిచింది. గాంధీయిజం పైజెప్పిన రెండు బూర్జువా పోకడలకలయిక. మితవాద్ములలోఉన్న పాశ్చాత్యనాగరికతమీద ప్రేమకు అతివాదులలోఉన్న ప్రత్యక్షచర్యభావం దేశీయాచారాలమీద ప్రేమకు గాంధీయిజంలో చక్కని ఐక్యత (Synthesis) ఏర్పడింది. అందువలన గాంధీ ఉద్యమం మహిళలనాకర్షించ గలిగింది. మహిళాఉద్యమం ఒక నూతనరంగుగూడ వచ్చింది.

## వివిధశాసనసభలు స్త్రీలకు ఓటింగుహక్కును అంగీకరించుట.

జాతీయ సంస్థలన్నీ స్త్రీల రాజకీయ హక్కులను ఇదివరకే సమర్థించాయని వ్రాశాను. దానికి ప్రత్యక్షనిదర్శనం ఇది.

స్త్రీలు బ్రహ్మాండమైన ఆందోళణ చేయ మొదలుపెట్టారు. మితవాదులతో నిండియున్న శాసనసభలు ఒకటివెంట మరొకటి స్త్రీల ఓటింగు హక్కును అంగీకరించినవి. 1921 లో ముందు మద్రాసుశాసనసభ; తరువాత బొంబాయి శాసనసభ స్త్రీల ఓటింగుహక్కును అంగీకరించినది. 1923 లో సంయుక్తరాష్ట్రాల శాసనసభ ఏకగ్రీవంగా అంగీకరించింది. ప్రపంచచరిత్రలో అప్పటికి ఇదే ప్రధమ ఘటన మొదట బెంగాలు

1922 లో అంగీకరించలేదు. 1925 లో తరువాత అంగీకరించింది. అస్సాముస్త్రీలు శాసనసభలకు నిలబడటానికి హక్కు-గూడ ఇచ్చి ఇంకొక అడుగు ముందుకు వేసింది. 1926 లో పంజాబు, 1927లో మధ్యపరగణాలు ప్యాసుచేశాయి. 1922లో బీహారు శాసనసభలో ప్యాసుకాలేదు. కాని 1929లో ప్యాసు అయింది. ఢిల్లీ కేంద్రశాసనసభ 1923 లోనే అంగీకరించినది. ఢిల్లీలోని స్టేట్సుకౌన్సిలు తరువాత చాల కాలానికి అంగీకరించింది. 1919 సంస్కరణల ప్రకారం స్త్రీలు శాసనసభలకు అభ్యర్థులుగా నిలబడే హక్కు లేదు. ఈ నిషేధం తొలగించాలని మధ్య తరగతి స్త్రీలు చాలపట్టణాలలో బహిరంగ సభలు పెట్టారు. ప్రభుత్వోద్యోగుల వద్దకు రాయబారాలు తీసుకు వెళ్ళారు. 1921లో ఆ నిషేధంగూడ తొలగింపబడింది. తరువాత అన్ని శాసనసభలు స్త్రీలు శాసనసభలకు నిలబడే హక్కును క్రమక్రమంగా అంగీకరించాయి.

స్వదేశసంస్థానాల్లో స్త్రీల స్థితి బ్రిటిషుఇండియాలోకన్న చాల అధ్వాన్నంగా ఉంది. కొన్ని సంస్థానాలు మాత్రం స్త్రీల విషయంలో బ్రిటిషు ప్రభుత్వంతోపాటు ముందుకువస్తున్నాయి. తిరువాన్కూరు సంస్థానం స్త్రీల ఓటింగుహక్కును 1920 లోనే అంగీకరించింది. మైసూరు, జలవర్, కొచ్చిన్ సంస్థానాలు ఓటింగుహక్కును ఇయ్యడమే కాకుండా చట్టాల్లో స్త్రీలమీదఉన్న నిషేధాలను తొలగించి స్త్రీలకుగూడ పురుషులతోపాటు సమాన హోదాను ఇచ్చినవి.

1919 సంస్కరణలవల్ల భారతదేశం మొత్తంమీద 10,00,000 మందికి స్త్రీలకుమాత్రమే వోట్లువచ్చినవి. ఇంత

తక్కువగా ఉండటానికి కారణం స్త్రీలకు ఆస్తిలేకపోవడం, గ్రాడ్యుయేటులయి ఉండాలన్న నిబంధనయే.

అఖిలభారత మహిళాసంఘం పుట్టుక.

స్త్రీలు తమ ఆందోళన ఫలితంగా ఓటింగుహక్కును, శాసనసభలకు నిలబడేహక్కును సంపాదించుటవలన వానిలో ఆత్మవిశ్వాసము నూతనచైతన్యం ఉద్భవించాయి. భారతదేశమంతట స్థానిక మహిళా సమితులు క్లబ్బులు వెలిశాయి. బ్రహ్మసమాజం ఆర్యసమాజం గూడ ప్రత్యేక స్త్రీశాఖలు ఏర్పరచినవి. క్రైస్తవ యువతీసంఘాలు (Young Womens Christian associations)గూడ ప్రతి పట్టణాల్లోనూ నిర్మించబడ్డాయి. 1917 లో వివిధ స్థానిక మాతా శిశురక్షణాలయాలను సంఘటితపరచి ఇండియన్ రెడ్ క్రాస్ సంఘం అఖిలభారత మాతాశిశుపోషణ సంఘాన్ని స్థాపించింది. గరల్ గైడ్ఉద్యమం (Girls guide movement) అనే స్కౌటుసంస్థగూడ ఆర్గనైజుచేయబడింది. భారతమహిళలు తమ ఉద్యమానికి సంఘటితరూపం ఇవ్వడానికి ప్రయత్నిస్తున్నారు. ఈ వివిధ మహిళా సంఘాలను సంఘటిత పరచి అఖిలభారత సంస్థను ఏర్పరచడానికి పరిస్థితులు పరిపక్వమయినవి. ఈ పరిస్థితుల్లో ఒకఘటన జరిగింది బెధూన్ కాలేజీలో బహుమతులు పంచేసందర్భంలో బెంగాలు ఎడ్యుకేషనల్ ఇన్స్పెక్టరు 'జటెస్' స్త్రీలను వారివిద్యా విధానాన్ని పురుషులచేతుల్లో ఉంచవద్దనియు వారే నిర్ణయించుకోవాలనియూ, ఉబోధించాడు. భారతమహిళాసంఘంయొక్క పత్రికలో వెంటనే స్త్రీధర్మంమీద హుడేకోపర్ అనే ఆమె

వ్యాసాలు వ్రాసి స్త్రీలవిద్యావిధానంమార్గం ఎలావుండాలో చూపించంది. తరువాత స్త్రీవిద్యావిధానాన్ని నిర్ణయించడానికి అప్పుడు పెద్దదిగాఉన్న భారతమహిళాసంఘం ఇతరసంఘాలకు ఆహ్వానాలు పంపింది. 1926 లో మొదటి అఖిలభారత మహిళా సమావేశం జరిగింది. దానిలో అఖిలభారతమహిళా సభను ఒకస్థిరమైన సంస్థగాచేయ నిర్ణయించబడింది 1927 లో అధీన సంఘాల ప్రతినిధులతో మొదటి మహాసభ పూనాలో సమావేశమయింది. అఖిలభారత మహిళాసంఘంలో రాజకీయాలతో సంబంధంలేదు. సంస్కరణవాదులు, కాంగ్రెసువాదులు, ప్రభుత్వోద్యోగుల భార్యలు, కొంతమంది రాణులు, సాంఘిక రాజకీయ స్త్రీలకోర్కెలకోసం పాటుబడే సంస్థగాఉ డేదిగాని రాజకీయాలతో అంతసంబంధముండేదిగాదు. నేటివరకుగూడ అంతే. కాని 1942 కాకినాడసభలో కాంగ్రెసు స్త్రీలుచాల ఎక్కువమంది వచ్చారు. అక్కడ కొన్నిరాజకీయ తీర్మానాలు ప్యాసుచేయబడినవని చెప్పి రాణులు ఉద్యోగులభార్యలై సంఘం నుండి తొలుగుతున్నారు. ఈమధ్యనే పిఠాపురంరాణి మరికొందరు రాజీనామా పెట్టారు. కాకినాడలో జరిగిన అఖిలభారత మహిళాసభ ఒక ముఖ్యమైనసభ. అఖిలభారత మహిళా సంఘంలో ఒక క్రొత్త మార్పును తీసుకువచ్చింది. 1942 వరకు ఈ సంఘంలో ప్రాబల్యం ఉద్యోగులదీ, రాణులదీ అగుటచే ఈసంఘ తీర్మానాలను పిటీషనులద్వారానే అమలు జరిపేవారు గాని, స్త్రీసామాన్య సమీకరణ పద్ధతికిదిగలేదు.

రెండవశాసనోల్లంఘనోద్యమం, స్త్రీలు-1929లో ప్రపంచమంతా బ్రహ్మాండమైన ఆర్థికమాంద్యం వచ్చింది. నిరుద్యోగం

విపరీతంగా పెరిపోయింది. దీనితో పెట్టుబడిదారి విధానమేకూలి పోతుందాఅన్న భయం వేసింది. ఈ ఆర్థికమాంద్యం రాబో తున్నదని ముందే గ్రహించి పెట్టుబడిదార్లు జాగ్రత్తపడటం మొదలుపెట్టారు. భారతదేశంలోగూడ అసంతృప్తి మిన్నుముట్టింది. భారతప్రజలు విప్లమార్గాలు పట్టిపోకుండా వారిని మోసగించడానికి 1928లో సైమన్‌కమిషన్ భారతదేశం వచ్చింది. ఈమోసాన్ని గ్రహించిన ప్రజలు భారతదేశమంతటా నల్లజండాలు చూపారు. ఈ సందర్భంలోనే పంజాబుకేసరి లాలాలజపతిరాయి, బలమైన లాఠీదెబ్బలుతిని తరువాత కొద్దిరోజులకే చనిపోయాడు. అఖిలభారత మహిళాసభ సంస్కరణవాదుల, ఉద్యోగుల భార్యల రాణుల నాయకత్వంక్రింద ఉండుటచేత సైమన్ కమిషనును బహిష్కరించలేదు. ఆర్థిక సంక్షోభంవల్ల రానున్న బ్రహ్మాండమైన ప్రజాఉద్యమాన్నుండి మితవాదులను చీల్చడానికి స్వల్ప సంస్కరణల నివ్వ సమకట్టింది. ఈ ఉద్యమంలో స్త్రీలు పాల్గొనకుండా చేయడానికి, స్త్రీలలో చైతన్య మెక్కువయిందనీ వారికి గూడ పురుషులతోపాటు పరిపాలనలో భాగమియ్యాలనీ, సైమన్‌కమిషన్ తన నివేదికలో వ్రాసింది.

## శారదాచట్టం

సాంఘిక సంస్కరణల విషయంలో విముఖత చూపుతున్నప్రభుత్వం, 1873లో బాల్యవివాహాలను నిషేధించి సనాతనులను సంతోషపెట్టడానికి నిషేధాన్ని ఉపసంహరించుకున్న ప్రభుత్వం, హటాత్తుగా స్త్రీలయెడల "సానుభూతిని" చూపమొదలుపెట్టింది 1929 లో ఢిల్లీ కేంద్ర శాసనసభలో శారద

చట్టానికి (హరవిలాస శారదాగారిచే పెట్టబడింది) ప్రభుత్వం సహాయంచేసి ప్యాను అయ్యేటట్లు చేసింది ఈ సానుభూతి అంతా స్త్రీలను, సాంఘిక సంస్కరణవాదులను రానున్న సత్యాగ్రహోద్యమంలో పాల్గొనకుండా చేయడానికే. సంస్కరణవాదుల ఆందోళన ననుసరించి చట్టంప్యాసుచేసినా దానిలో అనేక కంతలు ఉంచి సనాతనులనుగూడ సంతృప్తిపరిచింది. మొదటిది చట్టం అంగీకరింపబడిన వెంటనే అమలు జరుపక 1930 లో అమలు జరుపుటవలన ఎంతోమంది పసిపిల్లలకు పెండ్లి చేయబడింది. దీనిఫలితం చాలమంది బాలవితంతువులు అయ్యారు. ఈవిషయంక్రింద ఇవ్వబడె 1931 జనాభాలెఖ్ఖలను చూస్తే తెలుస్తుంది. 1 నుండి 25 నం॥ వరకూ వితంతువులు 1931 జనాభాలెఖ్ఖల ప్రకారం:—

| వయస్సు | వితంతువుల సంఖ్య |
|---|---|
| 0-1 | 1515 |
| 1-2 | 1785 |
| 2-3 | 3485 |
| 3-4 | 9076 |
| 4 5 | 150,18 |
| 5-10 | 105,449 |
| 10-15 | 183998 |
| 15-20 | 514394 |
| 20-25 | 846959 |

లెఖ్ఖలే తేటతెల్లంగా చూపుతున్నాయి. వాటిమీద విమర్శనగూడ అవసరంలేదు.

రెండవది బాల్యవివాహాలు. ప్రక్కననే ఉన్న స్వదేశసంస్థానంలోనో ఫ్రెంచి పోర్చుగీసు వాళ్ళ ఆధీనంలోనో ఉన్న ప్రాంతాల్లోకి, బ్రిటిషు ఇండియాలోనివారుపోయి చేసుకోవచ్చు. మనదేశంలో సంస్థానాలకు కొరతయేలేదు. ప్రతిచోటుకు అందుబాటులోనే ఉన్నవి.

మూడవది, ప్రభుత్వం ఇతరక్రిమినలు కేసులు పెట్టినట్లుగా ఈచట్టాన్ని ధిక్కరిస్తే కేసులు పెట్టరు. పైగా కేసుపెట్టేవారు కొంతడబ్బు డిపాజిటుకట్టాలి. దీనివల్ల ఎవ్వరూ కేసులు పెట్టసాహసించేవారుకారు. కాని ఇప్పుడు మహిళాసంఘాల ఆందోళనవల్ల ఈరూలును తీసివేసింది. ఇప్పుడూ బాల్య వివాహాలు అడ్డులేకుండా జరుగుతూనే ఉన్నవి.

స్త్రీలయెడల ప్రభుత్వం ఇంత దొంగసానుభూతిని కనబరచుచున్నప్పటికీ, స్త్రీలకుజాతీయపద్ధతులమీద శిక్షణ నిచ్చుటకు భారత్వపూనాలో నిర్మించిన మహిళావిశ్వ విద్యాలయాన్ని ప్రభుత్వం ఇంతవరకూ గుర్తించలేదు.

## శాసనోల్లంఘనోద్యమఆరంభం

సైమన్ కమీషన్ రిపోర్టు ప్రకటింపబడింది. సంస్కరణలను చర్చించడానికి గుండ్రబల్ల సమావేశం పిలువబడింది. అందులో స్త్రీలకుగూడ రెండు స్థానాలు ఇయ్యబడినవి. దేశంలో ఆర్థిక సంక్షోభం తీవ్రతరమయింది. కాంగ్రెసు 1929 డిసెంబరులో లాహోరు సమావేశంలో సంపూర్ణ స్వాతం

త్ర్యతీర్మానం చేసి జనవరి 26 వ తేదీ స్వతంత్ర్య దినోత్సవది
నంగా ప్రకటించింది. నాటినుండీ శాసనోల్లంఘనోద్యమం ప్రా
రంభమయింది. ప్రభుత్వం మహిళలను జాతీయోద్యమంనుండి
దూరంగా ఉంచడానికి చేసిన ప్రయత్నాలు విఫలమయినవి.
మహిళాప్రపంచాన్ని ఈ ఉద్యమం కలవరపెట్టినట్లుగా ముందే
ఉద్యమం కలవరపెట్టలేదు. మధ్యతరగతి స్త్రీలు గ్రామాల్లోని
రైతులస్త్రీలు వాలంటీర్లుగా చేరారు. లాఠీదెబ్బలు తిన్నారు.
జైళ్లకు వెళ్ళారు. 1921 లో మహిళలు స్వాతంత్ర్య పోరా
టంలో అడుగుపెట్టారు. తమ హక్కులు నెరవేరాలంటే
స్వాతంత్ర్యం సంపాదించాలని గ్రహించ మొదలుపెట్టారు.
ఈ 1930 ఉద్యమం ఆ పోకడను ఎన్నోరెట్లు తీవ్రతరంచేసింది.
1930లో మహిళలుగూడ జాతీయోద్యమంలో ఒక ప్రాముఖ్య
స్థానాన్ని సంపాదించారు. సత్యాగ్రహోద్యమం దావానలంవలె
భారతదేశం ఈకొననుండి ఆ కొనవరకూ వ్యాపించింది. ప్రజలు
గాంధీగారి అహింసఅనే ఉక్కుచట్రంనుంచి బయటపడుతున్నా
రు. పెషావరులో హిందువులైన గడవాల్ సిపాయిలు మహ
మ్మదీయ ప్రజాసామాన్యంమీద కాల్చనిరాకరించడం షోలాపూ
రులో కార్మికులు ఇతరప్రజలకు నాయకత్వం వహించి సైనికుల
నెదుర్కొని కొంతమందిని చంపడం, తత్ఫలితంగా మార్షల్‌లా
ప్రకటించడం దీనికి చిహ్నలుగా బయటపడినాయి. గాంధీజీ
ఉద్యమంచేతులుదాటిపోతుందేమో ననేభయంతో అప్పుడు
వైస్రాయిగా ఉన్న ఇర్విన్ ప్రభువు (ఇప్పుడు హాలిఫాక్సు ప్ర
భువు)తో 1931 లో సంధిని చేసుకొన్నాడు. బ్రిటిషుప్రభుత్వం
మొదటి గుండ్రనిబల్ల సమావేశంఉద్యమం జరుగుతూ ఉండ

గానే జరిపింది. దానికి ప్రజల్లో పలుకుబడి లేని కొంతమంది మితవాదులు మాత్రం హాజరు అయ్యారు. ఈ సయుక్తివల్ల ఉద్యమాన్ని చీల్చలేక పోవడంవల్ల, జాతీయోద్యమం ఏపురు పాటునున్నప్పుడు అణచివేయటానికి బ్రిటిషుప్రభుత్వం ఈ సంధికి ప్రయత్నాలు చేసింది. రెండవ గుండ్రబల్ల సమావేశం కోసం ప్రయత్నాలు జరుగుతున్నాయి.

1931 లో బొంబాయిలో కొంతమంది ముఖ్యులైన స్త్రీలు సరోజని నాయకత్వంక్రింద సమావేశమై ఒక అర్జీని తయారుచేశారు. దానిలోనిఫాంశాలు ఇవి (1) స్త్రీపురుషుల మధ్య న్యాయశాస్త్రదృష్టిలో భేదములను తొలగించుట. (2) మైనారిటీ వెళ్ళిన స్త్రీపురుషులందరికీ ఓటింగుహక్కు ఇచ్చుట (3) శాసనసభలకు స్త్రీలకు ప్రత్యేక నియోజకవర్గాలు సౌకర్యాలను రద్దుచేయుట. ఈ సూచనలను తరువాత అఖిల భారత మహిళాసంఘం (All India Womens Conference) భారత మహిళామండలి (Womens Indian assn.) నేషనల్ కౌన్సిల్ ఆఫ్ వుమెన్ అనే మూడు ముఖ్యమైన సంఘాలు అంగీకరించాయి.

రెండవ గుండ్రబల్ల సమావేశంలో ప్రాతినిధ్యం కోరడానికి అఖిలభారత మహిళాసంఘముతరఫున అప్పుడు రాజప్రతినిధిగ ఉన్న వెల్లింగుడన్ ప్రభువువద్దకు రాయభారం వెళ్ళింది. రాజప్రతినిధి ప్రాతినిధ్య మియ్యడానికి అంగీకరించలేదు. సరోజనిదేవిని అప్పటికే ఆహ్వానించుటచేత, ఆమెనే తమప్రతినిధిగా అఖిలభారత మహిళాసంఘం ప్రకటించింది. కాని దురదృష్ట

వశాత్తు ఆమె హాజరయిన సమావేశాల్లో ఈ విషయం రానే లేదు. రెండవగుండ్రబల్ల సమావేశంనుండి గాంధీజీ కాంగ్రెసు వాదులు తిరిగి వచ్చారు. వెంటనే అరెస్టుచేయ బడ్డారు. తిరిగి ఉద్యమం ఆరంభమయింది. ఈ 6 నెలల వ్యవధిలో ప్రభుత్వం చక్కగా సన్నాహాలుచేసుకొని కూర్చుంది అతిదారుణంగా ఉద్యమాన్ని అణచివేసింది.

ఈ సమయంలో లోధియన్ కమిటీఓటింగు విషయా లను నిర్ణయించడానికి భారతదేశంలో దిగింది. దేశమంతా నల్లజండాలు చూపబడ్డాయి. కాని అఖిలభారత మహిళాసంఘం భారత మహిళామండలి ప్రతినిధులు ఢిల్లీలోసమావేశమయి, లోధియన్ కమిటీపంపిన ప్రశ్నావళికి సమాధానమిచ్చారు. వివిధ రాష్ట్రాలలో కమిటీముందు సాక్ష్యమియ్యడానికి ప్రతినిధు లనుగూడ ఏర్పరచారు. లోధియను కమిటీ వ్రాయగల చదువ గల ప్రతిస్త్రీకి వోటుఇచ్చుటకు, భర్తవోటరుఅయితే భార్య గూడ ఓటరు అవడానికి నిర్ణయించింది. కాని ప్రభుత్వో ద్యోగి వద్దకువచ్చి స్త్రీలు పురుషులతోపాటు ఓటరు ఫారము పూర్తిచేయాలిసి వచ్చింది. దీనిమీద మరల అఖిలభారత మహిళాసంఘం ఆందోళనచేసింది. తరువాత రాష్ట్రహద్దులు నిర్ణయించడానికి భారతదేశం వచ్చిన డీలిమిటేషన్ కమిటీ (Delimitation) స్త్రీలు ఇళ్ళదగ్గర ఓట్లఫారాలు పూర్తి జేసి పంపడానికి అంగీకరించింది. తరువాత 1933 లో జాయింటు పార్లమెంటరీ కమిటీ రిపోర్టు బయటబడింది. అందులో మూడు మహిళాసంఘాలు 1931 లో కలిసి అంగీకరించిన అర్జీలోని

కోరికలు అంగీకరింపబడలేదు. మరల 1933లో ఈ మూడు సంఘాలుకలిసి మరొక అర్జీనితయారుచేసి, జాయంటు పార్లమెంటరీ కమిటీముందు సాక్ష్యమిచ్చుటకై ప్రతినిధులను పంపినవి. కాని లాభం లేకపోయింది.

## 1935 ప్రభుత్వచట్టం : స్త్రీలు

జాయంటు పార్లమెంటరీ కమిటీ రిపోర్టుననుసరించిచేయబడిన బిల్లును 1935 లో పార్లమెంటు అంగీకరించింది. దీన్నే 1935 ఇండియా ప్రభుత్వ చట్టంఅంటారు. దీనిలో ముఖ్యాంశాలు ఇవి (1) చట్టదృష్టిలో స్త్రీపురుషులు సమానులే (2) మొత్తం వోటర్ల సంఖ్య 3,50,00,000 అందులో స్త్రీవోటర్లు 60,00,000 1919 చట్టంతో పోల్చితే దీనిప్రకారం స్త్రీ వోటర్ల సంఖ్య 6 రెట్లు ఎక్కువఅయింది. మొత్తంజనాభాలో 100 కి 14 వంతుల మందికి వోట్లువచ్చినవి. మొత్తంమైనారటీ వెళ్ళిన స్త్రీ పురుషుల సంఖ్యలో 100కి 27 వంతులమందికిని వోట్లువచ్చినవి మొత్తం మైనారిటీ వెళ్ళిన స్త్రీలలో 100 కి 8 మందికి వోట్లు వచ్చినవి. 21 సంవత్సరాలు దాటిన స్త్రీలే ఓటుచేయడాని కర్హులు.

(3) స్త్రీలకురాష్ట్రకేంద్రశాసన సభల్లో మతకులపద్ధతి మీద స్థానాలు ప్రత్యేకించబడినవి.

## రైతులు, మధ్యతరగతి.

స్త్రీలు కాంగ్రెసు ఉద్యమంలో పాల్గొని జైళ్ళకు వెళ్ళడంతో ఘోషాపోయి మీటింగులకు రావడం అలవాటయింది. పత్రికలు చదవటం ఎక్కువయింది. విద్యనభ్యసించడంగూడ ఎక్కువ అయింది. అన్నివిధాలా స్త్రీలుముందుకు రామొదలు పెట్టారు. ఎన్నోతరాలనుండీ సంస్కరణవాదులు చేయలేనిపనిని కాంగ్రెసు కొద్దికాలంలో చేయగలిగింది. అంతకుపూర్వం సంస్కరణవాదులు చదువుకున్న స్త్రీలకుకాక స్త్రీ సామాన్యానికి వ్యాపింపజేయలేని సంఘసంస్కరణను, కాంగ్రెసు వ్యాపింప జేయగలిగింది.

## 1937 ఎన్నికలు : స్త్రీలు

స్త్రీలు 1937 లో జరిగిన రాష్ట్రశాసనసభలకు కాంగ్రెసుకు వోటుజేసి, కాంగ్రెసునుగెలిపించారు. స్త్రీల తరఫున కాంగ్రెసు స్త్రీలే ఎన్నుకోబడ్డారు. కాని అఖిలభారత మహిళా సంఘం జాతీయోద్యమంతో సంబంధం పెట్టుకోకుండా ఉండుట వలన ఇంతవరకూ సామాన్యస్త్రీలను ఆకర్షించలేకపోయింది. సామాన్యస్త్రీలు చాలముందుకు పోయారు. అఖిలభారత మహిళాసంఘం వారిని వెనుకకు లాగుచున్నది. కాంగ్రెసు నాయకత్వంగూడా సంపూర్ణస్వాతంత్ర్యంకోసం పోరాడకప్రజా ఉద్యమం అహింసహద్దులుదాటి పోయేటప్పుడు, ఉద్యమాన్ని

ఆప్రుతూ వచ్చింది. కనుక కాంగ్రెసునాయకత్వం పూర్ణస్వా తంత్ర్య సంపాదనకు ప్రజలను నడపలేదు. ఇప్పుడు ఫేసిస్టులు ప్రపంచాన్ని దుర్భరదాస్యంలో ముంచజూస్తున్న యీసమ యంలోగూడ దేశానికి కాంగ్రెసు నాయకత్వం తప్పుడుదారి చూపి, దేశాన్ని అరాజకంలోకి దింపడానికి ప్రభుత్వానికి అవ కాశమిచ్చింది. ప్రస్తుతం కాంగ్రెసువాదులు అవలంబించుచున్న పంథా ఫేసిస్టుదాస్యానికి దారితీస్తుంది. కనుక దేశాన్ని ఐక్య పరచి జాతీయప్రభుత్వాన్ని సాధించడానికి, దేశాన్ని ఫేసిస్టుల బాధనుండి కాపాడడానికి బాధ్యత కమ్యూనిస్టుపార్టీమీాదఉంది.

అఖిలభారత మహిళాసంఘాన్ని ఉద్యోగుల నుండి సంస్కరణవాదులనుండి రక్షించి, సామాన్యస్త్రీలను విరివిగా చేర్చి సామాన్య స్త్రీలప్రతినిధిసంస్థగా చేయాలి. జాతీయైక్యత లోకి తీసుకువచ్చి, జాతీయప్రభుత్వాన్ని సాధించడానికి స్త్రీల సహాయంగూడ తీసుకోవాలి. ఫేసిస్టులనుండి దేశాన్ని రక్షించ డానికి స్త్రీలనుగూడ తీసుకువచ్చి దేశస్వాతంత్ర్యాన్ని సంపా దించాలి. ఈ బాధ్యత కమ్యూనిస్టు స్త్రీలమీాదఉంది.

---

# తప్పొప్పుల పట్టిక

| పుట | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 14 | కమ్యూనిష్టుల | కమ్యూనిస్టుల |
| 4 | 11 | సూన్యం | శూన్యం |
| 4 | 22 | ప్రస్థుత | ప్రస్తుత |
| 6 | 19 | షైపైలు | షైలు |
| 7 | 16 | చూపిచాలి | చూపించాలి |
| 8 | 6 | లపై | లుపై |
| 8 | 14 | యానికి | యాన్ని |
| 9 | 8 | న్యాసాల్ని | న్యాసాన్ని |
| 9 | 17 | ఖింవాలి | ఖించాలి |
| 11 | 16 | ఖన్చులు | ఖర్చులు |
| 12 | 13 | ఆస్థి | ఆస్తి |
| 15 | 7 | మిదవాద | మితవాద |
| 16 | 9 | మాటలో | మాటల్లో |
| 17 | 23 | కందుగూరి | కందుకూరి |
| 21 | 5 | టప్పుటికి | టప్పటికి |
| 24 | 10 | ఫావెల్ | పావెల్ |
| 27 | 10 | వలశిన | వలసిన |
| 28 | 19 | పురుషబలే | పురుషలకే |
| 30 | 2 | లిష్టుప | లిస్టుప |
| 30 | 7 | దృవపరుస్తూనే | ధృవపరుస్తూనే |
| 30 | 11 | ఆస్థిని | ఆస్తిని |
| 34 | 15 | జిష్టుల | జిస్టుల |
| 35 | 4 | కానుండరాదు | గానుండరాదు |
| 35 | 9 | చెల్లదనిర | చెల్లదని |
| 45 | 3 | సూళ్ళలోకి | స్కూళ్ళలోకి |
| 47 | 19 | అప్పుటి | అప్పటి |
| 63 | 5 | విప్లమార్గాలు | విప్లవమార్గాల |

